THE

ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

DEBATES

[ *Part II—Proceedings other than Questions and Answers* ]

*OFFICIAL REPORT*

---

*Fifty third Day of the Sixth Session of the Andhra Pradesh Legislative Assembly*

---

ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Thursday, the 27th March* 1958

The House met at Half Past Eight of the Clock

[ MR. SPEAKER IN THE CHAIR ]

## QUESTIONS AND ANSWERS

[ SEE PART I ]

## BUSINESS OF THE HOUSE

మిస్టర్ స్పీకర్ : రెండు సంగతులు గౌరవనీయులైన మంత్రుల దృష్టికి తీసుకొని వస్తాను.

రూలు 74 క్రింద కొన్ని admit చేశాను. వీలైనంతవరకు 31 వ తేదీకి వాటికి జవాబు చెప్పడానికి ప్రయత్నించమని మంత్రులను కోరుతున్నాను. కొన్ని స్వల్పవ్యవధి ప్రశ్నలు allow చేశాను. అందులో ఒకటి M. L. A. కు సంబంధించినది. ఆయనకు యేవో దెబ్బలు తగిలాయి అని చెప్పారు. అసలు అడ్జరన్ చేయాలంటే నేను ఒప్పుకోలేదు. It is a very important matter. దీనికిమాత్రం గౌ. హోమ్‌శాఖా మంత్రిగారిని జవాబు చెప్పమని కోరుతున్నాను. అది నిజంగా స్వల్పవ్యవధి ప్రశ్నే! మిగిలినవాటికి జవాబులు చెప్పడానికి ప్రయత్నం చేయండి.

శ్రీ జి. గంగారెడ్డి (ముధోలు): On a point of order Sir. ఈ సెషన్ అయిపోతున్నది. అబ్కారీ డిమాండు చర్చకు రావడంలేదు. దీనినిబట్టి తెలంగాణాలో కూడ మద్యపానాన్ని నిషేధిస్తున్నారా ? అనే అనుమానం కల్గుతున్నది.

రెవెన్యూమంత్రి (శ్రీ కె. వెంకటరావు): లీడర్సు అందరూ కూర్చొనే ఫలానా, ఫలానా డిమాండులమీద చర్చించాలని అనుకొన్నారు. ఆ ప్రకారం

జరిగింది. ఈవేళ 1-30 అయ్యేసరికి అన్నీ—ఎక్కైజుపద్దు సహితముగా, సర్వం కత్తికిందకు పడిపోతాయి. అందుచేత దానినిగురించి మాట్లాడ నక్కరలేదు.

## MOTION FOR SUSPENSION OF RULE 157 (3) OF ASSEMBLY RULES

*The Chief Minister (Sri N. Sanjeeva Reddi)*: Mr. Speaker Sir, permit me to move;

That sub-rule 3 of the Rule 157 of the Assembly Rules be suspended and the Speaker do proceed to put every question necessary to dispose of all outstanding matters in connection with the Demands for Grants at 1-30 P. M., to-day.

*Mr. Speaker:* The question is :

That sub-rule 3 of the Rule 157 of the Assembly Rules be suspended and the Speaker do proceed to put every question necessary to dispose of all outstanding matters in connection with the Demands for Grants at 1-30 P. M., to-day.

The motion was adopted.

## REPORT OF THE ESTIMATES COMMITTEE ON PUBLIC HEALTH DEPARTMENT

*Sri Gopalrao Ekbote (High Court):* Mr. Speaker Sir, I beg to present the Third Report of the Estimates Committee on Public Health Department.

*Mr. Speaker*: Report presented.

## BUDGET - DEMANDS FOR GRANTS

### *Demand No. XXXVII—Community Development Projects etc.* *Rs.* 3,27,11,000

*The Minister for Planning (Sri V. B. Raju)*: Mr. Speaker Sir, on the recommendation of the Governor I beg to move that the Government be grated a sum not exceeding Rs. 3,27,11,000 under Demand No. XXXVII - Community Development Projects, National Extension Service and Local Development Works."

*Mr. Speaker*: Motion moved :

*శ్రీ వి. బి. రాజు : అధ్యక్షా, ఇప్పుడు ఈ పద్దుక్రింద రు. 3,27,11,000/-లు మంజూరు చేయవలసిందిగా ఈ శాసనసభను కోరబడింది. ఈ మొత్తంలో రు. 77,20,100 లు కమ్యూనిటీ డెవలప్‌మెంటు కార్యములకు, జాతీయ విస్తరణ కేంద్రాలక్రింద జరుగుతున్న పనికి రు. 1,69,90,900 లు, లోకల్

డెవలప్‌మెంట్ కార్యక్రమాలక్రింద జరుగుతున్న పనికి రు. 80,00,000 లు ఖర్చు చేయబడతాయి. ఇందులో రాష్ట్ర ప్రభుత్వం రు. 88,64,000 లు మాత్రమే తన వాటాగా భరించవలసి ఉంది. కేంద్రప్రభుత్వం రు. 1,43,36,000 లు భరిస్తుంది. ప్రజల దగ్గరనుంచి రు. 15,00,000 లు విరాళంగా వస్తుంది. ఈ విధంగా కమ్యూనిటీ ప్రాజెక్టులు, నేషనల్ ఎక్స్టెన్షన్ బ్లాకుల క్రింద రు. 2,40,00,000 లు ఖర్చు అవుతుంది. మిగిలిన రు. 80 లక్షలు Local Development Works క్రింద ఖర్చు పెట్టబడుతుంది ఇందులో రు. 40 లక్షలు కేంద్రప్రభుత్వం grant గా యిస్తుంది, రు. 40 లక్షలు ప్రజలు విరాళంగా ఇస్తారు. ఈ పద్దులోని వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

కమ్యూనిటీ డెవలప్‌మెంటు కార్యక్రమం 1952 సంవత్సరంలో ప్రారంభమైనది. ఏ సంవత్సరంలోనైనా, ఏ కార్యక్రమంలోనైనా కొరతపడితే దానిని మరుసటి సంవత్సరం నెరవేర్చుకొంటూ యింతవరకు 5 సం. రాలు గడిపాము. అనుకొన్న ప్రకారం ఈ కార్యక్రమమంతా పూర్తి కావాలంటే ఇంకొక పది సంవత్సరాలు పడుతుంది. ఇది 15 సంవత్సరాల కార్యక్రమమని మనం భావించుకోవచ్చు. మొట్టమొదట రెండవ పంచవర్ష ప్రణాళిక పూర్తి కాకముందు ఈ కార్యక్రమం రాష్ట్రమంతట ప్రారంభించ బడుతుందని ఊహించబడింది. కాని ఇప్పటివరకు మన అనుభవం దృష్ట్యాను, విచారణవల్ల, ఈ కార్యక్రమం రెండవ ప్రణాళికా కాలంలో పూర్తిగా అమలు కాకపోవచ్చునని తేలింది. ఈ కార్యక్రమాన్ని 1963 సంవత్సరం వరకు పొడిగించవలసిందిగా మెహతా కమిటీవారు సూచించారు. 1963 సంవత్సరంలో ప్రారంభమైన బ్లాకుల కార్యక్రమం పూర్తి కావడానికి మరో అయిదు సంవత్సరాలు పడుతుంది. రాష్ట్రం మొత్తంమీద 447 బ్లాకులలోను ఈ కమ్యూనిటీ డెవలప్‌మెంట్ కార్యక్రమం 1968 సంవత్సరానికి పూర్తి అవుతుందని చెప్పవచ్చు. 1952 సం. లో ప్రారంభమై 1968 సం. లో పూర్తి కాబోయే ఈ కార్యక్రమానికి రాష్ట్రప్రభుత్వం ఎంత ఖర్చుపెట్టబోతున్నదో ప్రజలు ఎంత విరాళంగా ఇవ్వవలసి ఉంటుందో, దాని విషయమై ఒక దృఢసంకల్పం ఉండేటట్టయితే, అందరి అభిప్రాయం ఒకే మాదిరిగా ఉండేటట్లయితే, అందరియొక్క collective wisdom తో మనం ఈ కార్యక్రమాన్ని దిగ్విజయం చేసికోవచ్చు.

మన రాష్ట్రంలో 20 జిల్లాలు, 183 తాలూకాలు, ఒక వెయ్యివరకు రెవిన్యూ సర్కిల్సు ఉన్నాయి. 26,456 గ్రామాలు ఉన్నాయి. పరిపాలనా సౌలభ్యంకొరకు మనం రాష్ట్రాన్ని ఈ విధంగా విభజించి పరిపాలిస్తున్నాము. అయితే ఈ కార్యక్రమంకొరకు జిల్లా, తాలూకా సరిహద్దుల్లోకాని, సంఖ్యలో కాని మార్పు తీసుకొనిరావడంలేదు. ఇప్పుడు తాలూకాకు, గ్రామానికిమధ్య

"బ్లాకు" అనే ఒక కేంద్రాన్ని మటుకు ఏర్పాటు చేస్తున్నాము. ఈ ఇరవై జిల్లాల్లోను అభివృద్ధి కార్యక్రమంకొరకు 447 బ్లాకులను administrative divisons గా ఏర్పాటు చేస్తున్నాము. ఇంతవరకు గ్రామప్రజలు తమ పనులకు అవసరాలకు తహశీలునే administrative division గా పరిగణిస్తున్నారు. ఇక ముందు తహశీలునుకాక ఈ బ్లాకులనే administrative divisions గా భావించ వలసి ఉంటుంది. ఇక వచ్చే పది సంవత్సరాల లోపల ఈ కార్యక్రమం పూర్తి అయినట్లయితే, ప్రజలకు తాలూకా కేంద్రాలకు పోవలసిన అవసరంకాని, తహశీలుతో సంబంధంకాని ఉండదు. ఇకముందు Block Headquarters తోనే ప్రజలకు సంబంధం ఉండేటట్లు మనం కల్పనచేయాలి. ఈ రాష్ట్రం మొత్తాన్ని 447 బ్లాకులుగా విభజించాము. 1968 సంవత్సరానికి ఈ బ్లాకులన్నిటిలోను National Extension Service and Community Development కార్య క్రమాలక్రింద రు. 35 కోట్లు ఖర్చవుతుంది. దీనిలో రు. 20 కోట్లు కేంద్ర ప్రభుత్వము రు. 15 కోట్లు రాష్ట్రప్రభుత్వమూ భరిస్తాయి. ఈ విధంగా 15 సంవత్సరాలలోను రు. 35 కోట్లు ఖర్చుచేయబడతాయి. ఒక్కొక్క బ్లాకు అయిదు సంవత్సరాల కార్యక్రమమైనప్పటికీ కూడా అన్ని బ్లాకులు ఒకేసారి ప్రారంభంకావు గనుక, అన్ని బ్లాకులలోను కార్యక్రమాలు ప్రారంభించి, పూర్తిచేయడానికి 15 సంవత్సరాలు పడతాయి. ఈ రు. 35 కోట్లు కాకుండా రు. 20 కోట్లు అప్పుగాకూడా ఇవ్వబడుతుంది. ప్రతి బ్లాకుకు రు. 4½ లక్షలు అప్పుగా ఇచ్చే అవకాశంఉంది. ఈ రు. 20 కోట్లు 447 బ్లాకుల్లోను రైతులకు ప్రజలకు అప్పు ఇవ్వబడుతుంది. ఇంతేకాకుండా ఈ 15 సంవత్సరాలలోను ప్రజల నుంచి మరో రు. 20 కోట్లు విరాళంగా వస్తాయి. అంటే ఈ 15 సంవత్సరాల లోను 447 బ్లాకులలో ఈ కార్యక్రమాలక్రింద రు. 75 కోట్లు ఖర్చవుతాయి. ఈకల్పన శాసనసభ్యులదగ్గర ఉండాలని నేను ప్రార్థిస్తున్నాను. ఇదేమీ చిన్న కార్యక్రమంకాదు. 15 సంవత్సరాల కాలంలోను 447 కేంద్రాలలో మూడు కోట్ల చిల్లర జనాభాయొక్క అభివృద్ధి కార్యక్రమాలక్రింద మొత్తం రు. 75 కోట్లు ఖర్చుకాబోతున్నాయి.

ఇంతవరకు ఈ కార్యక్రమంయొక్క పథకం ఏవిధంగా ఉందంటే, జాతీయ విస్తరణకేంద్రాల stage అయిన 3 సంవత్సరాలలోను రు. 4 లక్షల కార్యక్రమం జరగడం, తరువాత కమ్యూనిటీ డెవలప్‌మెంటు స్టేజి మూడు సంవత్సరాలలోను రు. 8 లక్షలు ఖర్చుకావడం జరుగుతోంది. మూడవ Normalization stage లో intensive development అయిపోయి, యథాస్థితికి వచ్చినట్లుగా భావించబడి ప్రతి సంవత్సరం రు. 63 వేలు ఖర్చుపెట్టబడుతోంది.

Mehta Committee సూచనలను కేంద్రప్రభుత్వం వారు ఆలోచిస్తు న్నారు. ఇపుడు ఉన్నవిధానం బాగాలేదనియు, ఆరు సంవత్సరాలకాలం ఎక్కు-

వనియు; మొట్టమొదట కార్యక్రమం 5 సంవత్సరాలు పెట్టి, N. E S. and C. D. లనే భేదంలేకుండా రు. 12 లక్షలు అయిదు సంవత్సరాలలో ఖర్చుపెట్టే టట్లు ఈ ఖర్చుపెట్టే బాధ్యత రాష్ట్రప్రభుత్వాలకు వదలిపెట్టి, ఈవిధంగా తారతమ్యాన్ని తీసివెయ్యాలని ఆలోచిస్తున్నారు. బహుశా దీనిని ఒప్పుకొంటారు. గనుక ఇకముందు N. E. S., C. D. అనే stages ఉండవు. ఐదు సంవత్సరాలు ఒకే stage గా ఉంటుంది. Intensive Development అయిన తరువాత దానిని అల్లా వదిలిపెట్టి ఉంచడం మంచిదికాదు. ప్రజలలో ఆసక్తి వచ్చిందని, వారు నిర్వహించుకోగలుగుతారని ఊహించి వదలడం మంచిదికాదు అందుచేత మరో ఐదు సంవత్సరాల కార్యక్రమం (2nd stage) తీసుకొని రు. 5 లక్షలు ఖర్చుపెట్టాలనుకుంటున్నారు. అంటే C D., N. E. S. అనేమాటలు తీసివేసి మొత్తం 10 సంవత్సరాల కార్యక్రమంలో పదిహేడు లక్షలు ఖర్చుపెట్టాలని ఉద్దేశిస్తున్నాము. కేంద్ర ప్రభుత్వం ఈ పద్ధతికి అంగీకరించినట్లయితే ఇప్పుడున్న Blocks అన్నీ మొదటి stage వి అయిపోతాయి. N. E. S., C. D. అనే భేదం ఉండదు. మొట్టమొదటిసారిగా నేను ఈ విషయాన్ని తెలియచేస్తున్నాను. మనం గత అయిదు సంవత్సరాల నుంచి ఏదైతే ఊహిస్తూవస్తున్నామో, ఆ ఊహను, ఆకల్పనను అట్లా ఉంచి, క్రొత్తకల్పనను తీసుకోవలసి ఉంటుంది. కాబట్టి N. E. S., C. D., Post Intensive Stage అనే మాటలను అనుకోవలసిన అవసరం పట్టదనుకొంటున్నాను. మొదటి stage 5 సంవత్సరాలలో రు. 12 లక్షలు; రెండవ stage 5 సంవత్సరాలలో రు. 5 లక్షలు ఖర్చు పెట్టడం అనే పద్ధతి అమలులోకి వస్తుంది.

Financial గా మీకు ఒక picture ఇచ్చాను. ఈ ప్రకారం చేస్తే, దాదాపు 100 కోట్ల రూపాయల programme అవుతుందని మనవిచేస్తున్నాను. ఈ రెండవ పంచవర్ష ప్రణాళికలో ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రం కొరకు ఈ కార్యక్రమాలకొరకు 15 కోట్ల రూపాయలు కేటాయించాము. ఇది చాలదని నా అభిప్రాయం. ఈ కొత్త ఊహలు చూచిన తరువాత బహుశః ఈ రెండవ పంచవర్ష ప్రణాళికను సవరించవలసిన అవసరం ఉంటుందేమోనని భావిస్తున్నాను. మొదటి, రెండవ ప్రణాళికలో 15,20 కోట్ల రూపాయలు ఖర్చు అయినా ఇంకా 80 కోట్ల రూపాయల కార్యక్రమము ఉన్నది. ఇప్పుడు మొట్ట మొదట ఏదో అడుగుపెట్టి, అంకురార్పణ చేశామేగాని, వాస్తవంగా అసలు ఆ కార్యక్రమము ఉధృతంలోకి, ఉత్తేజంలోకి intensity లోకి మనం ఇంకా ప్రవేశించలేదు. ఇకముందు జరగవలసిన పనులు చాలా ఉన్నాయి. ప్రస్తుతం మన రాష్ట్రంలో 185 కేంద్రాలలో పని జరుగుతున్నది. ముఖ్యంగా ఈ current year తో అనగా 1957-58 లో కొత్తగా 58 National Extension Blocks మొదలు పెట్టాము. 9 కేంద్రాలను Community కేంద్రా

లుగా మార్చాము. ఇంత పెద్ద పెట్టున క్రిందటి సంవత్సరంలో ఎప్పుడూ జరగలేదు ఈ 185 block లలో, 127 block లు ఆంధ్రలో ఉన్నవి 58 Block లు తెలంగాణాలో ఉన్నవి. మొత్తం రాష్ట్రాన్ని 447 block లుగా విభజిస్తామని చెప్పాను. ఆంధ్ర జిల్లాలలో 303 Block లుగా విభజింపబడి ఉన్నాయి. తెలంగాణా జిల్లాలు 144 Block లుగా విభజించబడి ఉన్నాయి, ఈ 185 కేంద్రాలలో 31-3-1958 వరకు 112 N, E. S. Block లుగా ఉన్నాయి. 47 Community Development Block లుగా ఉన్నవి. 22 Normalisation Block లుగా ఉన్నవి. 4 Multipurpose Block లుగా ఉన్నవి. ఈ విధంగా కొత్త పద్ధతిని అవలంబించినట్లయితే ఈ 22 Normalisation Block లు, ఈ సంవత్సరం normalise చెయ్యబోయేవి, ఇవన్నీ కలిసి, 2nd stage Block లుగా తయారవుతవి. ఇక ఈ సంవత్సరం మొదలుపెట్టబడినవి, ఇంతవరకు పనిచేస్తూన్న N. E. S. Block లు, ఈ 1958-59 లో మొదలుపెట్టబడేవి. ఇవన్నీ కలిసి Ist stage block లుగా అయిపోతవి. ఇవి కాకుండా Commnnity Development Block లు కూడ Ist stage Block లు అవుతవి. అంటే, 5 సంవత్సరాలలో 12 లక్షల రూపాయలు ఖర్చవుతుందని, మీకు ఏదైతే మొదట్లో చెప్పానో, ఆ పథకం క్రిందకే ఇవన్నీ వస్తాయి. ఈ సంవత్సరం పని బాగానే జరుగుతున్నది. ప్రజల దగ్గరనుంచి వచ్చిన విరాళాలు ప్రభుత్వము చేసే ఖర్చులు, సక్రమముగానే ఉన్నవి. ఈ Community Development క్రింద ఖర్చు, ఏదో కొంచెం తక్కువగా కనబడుతుంది. అంటే దానికి కారణం కేంద్ర ప్రభుత్వం వారిని మనం ఎంత మొత్తాన్ని అడిగామో, వారు అ మొత్తాన్ని ఇవ్వలేదు. అందుకొరకు ఆ పద్దులో కొంత తక్కువగా ఖర్చు అయినది. ఈ కార్యక్రమంలో జరిగే పనిని గురించి, గౌరవ సభ్యులు విమర్శించేముందు, రెండు మూడు విషయాలు దృష్టిలో ఉంచుకోవాలని ప్రార్థిస్తున్నాను. ఈ కార్యక్రమములో ఏదైనా లోపం ఉందా అని అనేక కమిటీల వారు వచ్చి విచారించారు. ప్రతి పర్యాయము కేంద్ర ప్రభుత్వంవారు అంచనాలను మనకు తెలియచేస్తూ ఉన్నారు. ఎప్పటికప్పుడు ప్రతి విషయంలో, జాగ్రత్తగా పరిశీలన జరుగుతున్నది. ఈ కార్యక్రమంలో ఇంకేదైనా మార్పు తీసుకురావాలని శాసనసభ్యుల దృష్టిలో ఉన్నట్లయితే, ఆ సూచనలను మాకు అందజేస్తే, ప్రభుత్వము తప్పకుండా గౌరవిస్తుంది. అవి యోగ్యమైతే వాటిని అమలు పరచడానికి ప్రయత్నిస్తాము. ఏ కార్యక్రమము అయినా సరే, Block లో ఉన్న ప్రజాప్రతినిధులతో కూడిఉన్న కమిటీల అనుమతి పొందిన తరువాతనే, ఆ కార్యక్రమము అమలులోకి వస్తుంది. ఇంతవరకూ, ఈ విధంగానే ఆచరిస్తున్నాము. ఇక ముందునుంచి, ఇంకా ఎక్కువ పట్టుదలతో ఆచరించబడుతవి. అధికారులు, కేవలం ప్రజాప్రతినిధులతో సహకరించడంఅనే

మాట కాకుండ, వారి అనుమతిని పొందిన తరువాతనే, అమలులోకి పెట్టడం జరుగుతున్నది. గనుక కార్యక్రమములో ఏదైనా లోపం ఉంటే, ఇకముందు ఆ బాధ్యత ప్రజా ప్రతినిధులమీదనే ఉంటుందని మనవిచేస్తున్నాను. ఈ కార్యక్రమము పైస్థాయిలో తయారై, అమలుపరచడానికి క్రిందిస్థాయికి పంపబడుతుందని భావించ వద్దు. క్రిందిస్థాయి అనుమతి పొందినతరువాతనే పైకి వస్తుంది. అసలు కార్యక్రమంలో ఏమీ లోపం లేదని మనవిచేస్తున్నాను. ఏవైనా లోపాలు ఉన్నట్లయితే అవి దీనికి సంబంధించిన organisation లో గాని, లేక దీనికి కావలసిన ధన సేకరణ విషయంలోగాని, లోపం ఉండితీరాలి. ఈ కార్యక్రమాన్ని అమలుపరచడానికి జిల్లా level లో Collector గారే దీనికి బాధ్యులు అయి ఉన్నారు. వారు జిల్లా అధికారి కాబట్టి ఈ కార్యక్రమాన్ని అమలుచెయ్యడంలో మొత్తం బాధ్యత వారే వహించాలని ప్రభుత్వంయొక్క policy. ఆ విధంగా ప్రభుత్వం ఉత్తర్వులు జారీచేసింది. జిల్లాఅధికారులు, ఇతర department అధికారులు వారి ఆజ్ఞలక్రిందనే పనిచెయ్యవలసి ఉంటుంది. Collector గారే వారందరిలో ఏకతను తీసుకొని వస్తారు. జిల్లా అధికారులు కూడ Collector గారితో ఒక team గా ఏర్పడి, ఈ కార్యక్రమాన్ని అమలుచేస్తూ ఉన్నారు. జిల్లా దాటినతరువాత, block level లోకి వచ్చినప్పుడు Block Development Officer, Extension Officer, వీరు ఇద్దరూ ఒక team గా ఏర్పడి పనిచేస్తున్నారు. Block Development Officer గారే సలహాలు ఇస్తూ, leader of the team గా పనిచేస్తూ ఉంటారు. వీరందరు collective గా పనిచేస్తూ ఉన్నారు. వీరికి సలహాలు ఇవ్వడానికి జిల్లా స్థాయిలోగాని Block స్థాయిలోగాని, ప్రజా ప్రతినిధులతో కూడిన సలహాసంఘాలు ఉన్నాయి. వారు సలహాలు ఇస్తుంటారు. ఈ వ్యవస్థ సక్రమముగా పనిచేస్తుందా, లేదా ? అనే విషయాలపై పలువురు పలు అభిప్రాయాలు ఇస్తున్నారు. ఈ పద్ధతి బాగాలేదని, దీనిని మార్చాలని, కొందరు ప్రజాప్రతినిధులు కోరారు. అధికార్లలోకూడ అటువంటి అభిప్రాయం ఉన్నది. భారత ప్రభుత్వంయొక్క ఉద్దేశ్యంకూడ ఈ విధంగానే ఉన్నది.

బ్లాకు లెవెల్ పంచాయితీ Presidents తో కూడిన సంస్థ బాధ్యత తీసుకోవాలి. ఇప్పుడున్న సలహా సంఘాలతో లాభములేదు. సలహా యివ్వడమే కాకుండా అమలుచేయడములో కూడా యీ కమిటీలు బాధ్యత తీసుకోవాలని పంచాయితీ బోర్డుల ప్రెసిడెంట్లతో కూడిన యీ Block సంస్థలు ఏర్పాటు చేయడమైందనే విషయము మీకు తెలియచేయబడినది. దీనిని గురించి మరి నేను చెప్పనవసరములేదు. అదేవిధంగా జిల్లాలలో కలెక్టర్లతోను జిల్లా అధికారులతోను, శాసనసభ్యుల పార్లమెంటు సభ్యులతోను యీ బ్లాకు సంస్థ అధ్యక్షులతోను కలసి యీ జిల్లా పరిషత్తులు ఏర్పాటౌతాయని ఇదివరకే మనవి చేయబడినది. ఇక గ్రామపంచాయితీబోర్డులు యీ బాధ్యతలను తీసుకోవాలనికూడా

తెలియచేయబడినది. ఇపుడు మనము మూడు stages లో యీ వ్యవస్థను ఆలోచించవలెను. గ్రామపంచాయితీబోర్డు, అక్కడ పనిచేసేటటువంటి గ్రామసేవకుడు, తర్వాత బ్లాక్ లెవెల్‌లో యీ బ్లాక్ సమితికి బ్లాక్ development ఆఫీసర్ దీనికి executive officer గా పనిచేయడము జరుగుతుంది. జిల్లా లెవల్‌లో కలెక్టర్‌గారితో కూడినటువంటి జిల్లా District council ఉంటుంది. యీ మూడు స్టేజిలలో యీ పరిపాలనావ్యవస్థను Administrative structure ను పునర్నిర్మాణము చేస్తున్నాము. దీనియొక్క ఫలితాలు బాగుగా ఉండవచ్చునని ఊహిస్తున్నాము. ఆ విధంగా ఇపుడు అమలులోకి తీసుకొనిరాబోతున్నాము. అది కొంతకాలముపట్టుతుంది. ఒక్కసంవత్సరంతో అయ్యేదికాదు. ఈ నాలుగైదు సంవత్సరాలలో ఈ వ్యవస్థఅమలులోనికివస్తుంది. కనుక వ్యవస్థవిషయంలో ఇంతకంటే నేను ఎక్కువగాచెప్పవలసిందేమిలేదు. ఈ Re-organised structure ఏదైతే ఉందో దాని ఫలితాలు ఎటుల ఉండునో అని తెలిసికొనే అంతవరకు కూడా విమర్శలేమి చేయకుండా ఉంటే మంచిదని నా అభిప్రాయము. ఈ వ్యవస్థలో ఇంకా ఏమైన మార్పులు తీసుకువస్తే బాగుంటుందని కొందరు సూచనలు చేస్తే వాటినిగురించి తప్పకుండా ప్రభుత్వము ఆలోచించుతుంది. కాని దానికి అవకాశమివ్వకుండా వెంటనే విమర్శించినట్లయితే మనము ఇప్పుడు ఏమి తెలిసికోజాలము. ఇకపోతే యీ Block level లో యీవేళ పనిచేస్తున్న ప్రభుత్వ సిబ్బంది సరిపోతుందా ? సరిపోదా ? అని చూడవలసియున్నది. కొంతమంది — ఈ extension officers కానివ్వండి, గ్రామసేవకులు, గ్రామసేవికలు కానివ్వండి—వీరందరుకూడా అనవసరమని అభిప్రాయపడుచున్నారు. వీరికి పనిలేదని, వీరికి జీతాలు ఉచితంగా యిస్తున్నారని, వీరిసంఖ్య తగ్గించవలెనని అంటున్నారు. ఇంక కొంతమంది యీ సిబ్బంది చాలదు. యీ సిబ్బందిని ఎక్కువ చేయాలని అంటున్నారు. Experts అభిప్రాయముకూడా ఇదే ఇదే కాకుండా శాసనసభ్యులలో ప్రముఖుల అభిప్రాయము కూడా ఇదే. పార్టీ లీడర్ల అభిప్రాయముకూడా ఇదే. Consultative కమిటీలో చర్చకు వచ్చినపుడు నిర్మాణాత్మకమైన సూచనలుకూడా చేయబడినవి. ఇపుడు ఒక్కొక్క Block లో 10 మంది గ్రామ సేవకులున్నారు. Block లో వున్న 50,60 గ్రామాలకు వీరు సరిపోరు. ఒక్కొక్కరు 4,5 గ్రామాలకు వెళ్ళి పనిచేయమంటే వారు చేయలేరు. వ్యవసాయమనుకోండి, రోడ్ల విషయమనుకోండి, ఇండ్లను కట్టించే విషయమనుకోండి. యీ పనులనన్నిటినీ ఒక్క కార్యకర్త సరిగా చూచుకొనజాలడు. కనుక ఒక బ్లాకులోవున్న 10 మంది గ్రామసేవకులను రెట్టింపు చేయమని, ఒక్క గ్రామసేవకునికి రెండు గ్రామాలకంటే ఎక్కువ యివ్వద్దనే సూచనకూడా వున్నది. ఇదే కాకుండ వ్యవసాయానికి సంబంధించిన Extension Officer ఇపుడు ఒకరు ఉన్నారు. ఆ ఒక్కరు సరిపోరు. ఇద్దరుండా

లని సూచనలు వచ్చినాయి. అదేవిధంగా రోడ్లు వేయుటకు కాని buildings కట్టడానికి కాని యీ P. W. Personnel సరిపోరని వారినింకా ఎక్కువ చేయాలని కూడా సూచనలు వచ్చినాయి. యీవిధంగా పలు అభిప్రాయాలున్నవి. ప్రభుత్వ అభిప్రాయమేమిటంటే, ఇపుడువున్న Technical Personnel సరిపోదని, అది ఇంకా ఎక్కువ ఉండాలని చెప్పింది. కాని దాని క్రింద ఎక్కువ డబ్బు ఖర్చు పెట్టడము మంచిదికాదు. ఇపుడు వివిధ డిపార్టుమెంటు ఉద్యోగస్థులు ఎవరైతే Blocks లో ఉన్నారో వారినందరిని కూడా యీ Block organisation లోనికి తీసుకొచ్చి integrate చేసి అక్కడినుంచే కావలసిన సిబ్బందిని పూర్తి చేసుకోగలము. ఇపుడు రివెన్యూ ఇన్స్పెక్టర్లు కానివ్వండి ఇతర డిపార్టుమెంటు ఉద్యోగస్థులు కానివ్వండి, యీ కార్యక్రమంతో సంబంధములేకుండా ఉన్నారు. పటేల్ పట్వారీలైన గ్రామాధికారులుకూడా యీ కార్యక్రమానికి సంబంధములేకుండా వున్నారు. ఈ రివెన్యూ ఇన్స్పెక్టర్లు కాని, యీ గ్రామాధికారులుకాని యీ development కార్యక్రమంలో జోక్యము కలుగజేసుకొని కొంత బాధ్యతతో పనిచేయడానికి వీలుంటుందని కూడా ఆలోచించబడింది. ఇంకా యీ కార్యక్రమము పూర్తి కాకముందే ఏదో ఒక పద్ధతిని తెలిసికోగలుగుతాము. ఇది చూచిన తర్వాత ఉద్యోగస్థుల సంఖ్య తక్కువ పడేటట్లయితే ఆ సంఖ్యను గురించి అప్పుడు ఆలోచించబడుతుంది. ఇపుడేదైతే ఒక పథకముందో దానిని మార్చకుండా పదిమంది గ్రామసేవకులతో ఆ కార్యక్రమమును నడుపుకోవాలని నిర్ణయము చేసుకున్నది ప్రభుత్వము. Development Block లో గ్రామసేవికలు ఇపుడు ఇద్దరున్నారు. వారిని ఐదుకు పెంచమని, సూచనలు వచ్చినవి. 5 కు పెంచడానికికూడా ప్రయత్నము జరుగుతున్నది.

ఈ కార్యక్రమము మొత్తం పూర్తిఅయేటప్పటికి దీనిలో పనిచేసేటటువంటి సిబ్బంది మొత్తం 25,000 మంది ఉంటారు, అంటే direct employment 25 వేలమందికి కల్పించబడుతుంది. 4500 మంది ఆఫీసర్లు ఉంటారు. 2500 మంది గ్రామసేవికలు ఉంటారు. 5000 వరకు గ్రామసేవకులు ఉంటారు. ఇతర staff తో కలిపి— మంత్రసానులు కానివ్వండి, Veternary assistants, accounts కు సంబంధించినవారు, peons కానివ్వండి— వీరందరు కలసి మొత్తం యీ కార్యక్రమానికి సంబంధించినంతవరకూ 25,000 మంది ఉంటారు. ఇందులో ఎక్కువ సంఖ్య Technical personnel ఉంటారు. ఏదైనా welfare state అవునా కాదా అని తెలిసికోవాలంటే యీ service personnel composition ను బట్టి మనము తెలిసికోవచ్చును. ఈ service personnel లో development కు సంబంధించిన Technical ఉద్యోగస్థులు ఎక్కువమంది ఉంటే అది welfare state అని అనిపించుకుంటుంది. వీరిసంఖ్య తక్కువగాఉండి

కేవలము పరిపాలనకొరకు, regulatory functions కొరకు పన్నులు వసూలు చేయడానికి కాని, security services లో కాని Judicial services లో కాని ఎక్కువమంది ఉద్యోగస్థులు ఉన్నట్లయితే అది welfare state అనిపించుకోదు. అంటే క్రమంగావున్న యీ ఉద్యోగస్థుల సంఖ్యలో ఉద్యోగస్థుల structure లో దానియొక్క character ను మనము మారుస్తూ ఉన్నాము అంటే the percentage of the Technical services will increase and so will be increasing continuonsly అంతేకాకుండా నేనిపుడే చెప్పినట్లు స్త్రీలకు ఎక్కువపని చేయడానికి యీ కార్యక్రమంలో అవకాశము కల్పించబడింది. 2500 మొదలు కొని 3,000 వరకు స్త్రీలు యీ కార్యక్రమములో పనిచేయడానికి అవకాశ మేర్పడుతుంది. Social Education Organisers కాని, గ్రామసేవికలు కాని మంత్రసానులుకాని, నర్సులుకాని ఈ organisation యొక్క composition యీవిధంగా ఉంటుంది. ఈ కార్యక్రమము విజయవంతము కావాలంటే ప్రజల ఋణములుకాని విరాళాలుకాని యిచ్చి సహకరించాలి. ప్రజల నుంచి సహకారము రాకపోతే యీ కార్యక్రమము విజయవంతము కాజాలదు. Peoples contribution and participation దీనియొక్క ప్రధాన ఉద్దేశం. ఎక్కడైనా పని జరుగలేదు అంటే ఈ లోటువల్లే కాని, మరొకటికాదు. ఎప్పుడైతే ప్రజలు తమ భాగాన్ని (contribution) ఇవ్వనక్కర లేదనుకుంటారో, ప్రజల సహకారం అక్కరలేదనుకుంటారో, అప్పుడది సమాజ వికాస కార్యక్రమం కాజాలదు. ప్రజా సహకారం తీసివేసిన తరువాత ఈ కార్యక్రమాలలో మిగిలేదిలేదు. ప్రభుత్వ ఉద్యోగస్థుల ద్వారా ప్రభుత్వ యంత్రాంగం ద్వారా ఈ పని జరగాలంటే దానికి ఇంత కర్మకాండ అవసరంలేదు; ఇంత రాద్ధాంతమూ అక్కరలేదు. ఇన్ని చర్చలూ అక్కరలేదు. ఇందులో మొదటిదశ ప్రజలను విచారించడం, వారి అవసరాలను తెలుసుకోవడం, రెండవది వారి సహకారం పొందటం. వారు ఈ కార్యక్రమంతో కలిసి, సంపూర్ణంగా లీనమైపోయి, అందులో పాల్గొనడం—co-operation and participation—అనేది పెద్దవిషయం. దీనిని మనం ఎంతవరకు సాధించమో, ఎంతవరకు ప్రయత్నం చేయమో, అంత వరకు తక్కినవిషయాలను గురించి విమర్శించి ప్రయోజనంలేదు. తక్కిన విషయాలను సులభంగానే సవరించుకోవచ్చును. కార్యక్రమాన్ని పథకాన్ని మార్చాలంటే పదిమంది ఉద్యోగులతో మార్చవచ్చును. పరిపాలనా వ్యవస్థను సులభంగానే మార్చవచ్చును. ప్రజల సహకారం కావాలంటే ఏ ఒకరిద్దరివల్లనో కాదు. సహకారం గ్రామాలనుంచి బయలుదేరవలె, అక్కడి ప్రజా నాయకుల నుంచి ప్రభుత్వ ఉద్యోగులనుంచి సహకారం రావాలి. వారికి పట్టుదల ఉండాలి. ఇది ఎంతవరకు లేదో, ఈ కార్యక్రమం అంతవరకు సఫలం కాజాలదు. మొదట మనం ప్రజల సహకారం సంపాదించుకో గలిగామా అని ఆలోచించుకోవాలి.

ప్రజలు కార్యక్రమాలలో పాల్గొంటున్నారో, లేదో విచారించుకోవాలి. లేక పోతే ఎందుకు చేయలేదో తెలుసుకోవాలి ఈ నాటి చర్చలో ఈ పద్దుకు సభ వారు అంగీకారం ఇచ్చే సందర్భంలో ప్రభుత్వానికి చేయవలసిన సూచనలేమైనా ఉన్నట్లయితే అవి ఈ విషయమునకు సంబంధించినవే అని నేను భావిస్తున్నాను. ప్రజల సహకారం ఎందుకు సంపాదించుకోలేకపోతున్నామో, వా రెందువల్ల కార్యక్రమాలలో పాల్గొనలేదో, లోపం ఎక్కడ ఉన్నదో గుర్తించాలి. ఇదిజరిగిన నాడు తక్కిన చిన్న విషయాలు సర్దుబాటు చేసుకోవచ్చు. రోడ్ల maintenance బాగాలేదు; భవనాలు సరిగా కట్టలేదు—ఇటువంటివన్నీ సవరించుకోవచ్చును. కనబడేఇటువంటి లోపాలను గురించి ప్రహ్మాండంగా భయపడవలసిన అవసరం లేదు. ఈ రోజు కాకపోయినా రేపు సవరించుకోవచ్చును. రేపు కాకపోతే ఎల్లుండి సవరించుకోవచ్చును. ఇటువంటి లోపాలున్నాయన్న సంగతి ప్రభుత్వానికి తెలుసును ఒకటిమాత్రం చెబుతాను. ఇందులో కొంత వృధాఖర్చు ఉండవచ్చును. కొంతమంది పని చేయకపోవచ్చును. కొంత ఆలస్యం జరుగుతుండవచ్చును. 185 కేంద్రాలలో దాదాపు 100 కేంద్రాలలోనైనా నేను తిరిగి ఉంటాను. ఎక్కడా కూడా లంచగొండితనం ఉన్నదని, అధికారులుగాని అనధికారులు గాని, ఎవ్వరూ చెప్పలేదు. విశ్వేశ్వరరావుగారు చేయి ఎత్తుతున్నారు. కాద న్నట్లు నేను ఈ సభాముఖంగా చెబుతున్నాను, లంచగొండితనం ఉన్నట్లయితే బ్లాక్ కమిటీలో చర్చించారా?— ఇదే నేను మొదట అడిగేది. ఇందులో లంచ గొండితనం ఉండడానికి ఎందుకు అవకాశం లేదో కూడా చెబుతాను. వ్యక్తుల మధ్య జరుగు వ్యవహారములలో (individual transaction) లంచగొండితనం ఉండడానికి అవకాశం ఉంటుంది ఒక ప్రభుత్వ ఉద్యోగికి ఒక వ్యక్తికి వ్యవహా రం ఉంటే, రహస్యంగా లంచగొండితనం ఉండవచ్చును. ఈ కార్యక్రమాలు వ్యక్తుల మధ్య వ్యవహారం కాదు. ఒక జట్టు (group) మరొకజట్టుతో (group) వ్యవహరించవలసి ఉంటుంది అధికారులు కూడా ఒక జట్టుగా (team) పని చేస్తారు. ఇచ్చేపని కూడా ఒక వ్యక్తికి, ఒక కంట్రాక్టరుకు ఇవ్వడం ఉండదు. గ్రామాలలో ఉండే ఏ గ్రామస్థుల కమిటీవంటి (Sponsors' Committee) సంస్థకో ఇవ్వవలసిఉంటుంది. లంచం తీసుకుందామనుకున్నా ఇచ్చేవాడు ఉండడు. ఎందుచేతనంటే ఇది సామూహికంగా జరిగే కార్యక్రమం. It is a collective functioning అని నా విశ్వాసం. ప్రభుత్వం విశ్వాసం ఏమంటే— ప్రజలతో సామూహికంగా వ్యవహరించే సందర్భాలలో లంచగొండితనానికి అవకాశం తక్కువగాఉంటుంది. విడివిడిగా వ్యక్తులతో వ్యవహరించే సందర్భాల లోనే అట్టి అవకాశం ఎక్కువగా ఉంటుంది. ఒకవేళ లంచగొండితనం ఉన్న దన్నా సరే, దానిని గురించి విరివిగా మనం విన్న ఉపన్యాసాలతో పోల్చినపుడు ఇక్కడ చాలా తక్కువగా (most minimum) ఉన్నదని చెప్పవలసివస్తుంది.

మనం ఒకటి గుర్తించాలి, శ్రీ గోపాలకృష్ణయ్యగారికి కూడా తెలుసును. ప్రపంచంలో absolutism అనేది లేదు. సత్యమన్నదే absolute కాదు. అబద్ధముగా కనబడనిదీ సత్యమే. Absolute truth అంటూ లేదు, కనుక పరిపూర్ణత అనేది ఎటువంటిదో, ఏ దశలో వస్తుందో చెప్పలేము. ఆలస్యాన్ని, లంచగొండితనాన్ని తగ్గించడం (minimising delay and curruption), సామర్థ్యాన్ని పెంపుదల చేయడం (improvıng efficiency) ఇవే మనకు కావలసినవి. ఏ మార్గంలో (trend) మనం పోతున్నామో ఆలోచించుకోవలసి యున్నది. మార్గములే (Trends) కాని గమ్యములు (ends) లేవు. జీవితంలో నడచే నడక ఎటువంటిదో చూడవలసినదే కాని గమ్యస్థానం అంటూ లేదు. నిన్నటికన్న ఈ రోజు ఎక్కువ అభివృద్ధి చెందామా, లేదా అన్నదే చూడాలి. అభివృద్ధికి పరిమితిలేదు; saturation point లేదు; last demarcating line లేదు. అంతా relative. నిన్నటికన్న ఈరోజు ఎట్లున్నది అన్నదే చూడాలి. అభివృద్ధి లేదు అనుకొంటుంటే కొండఎక్కినా అసౌఖ్యంగానే ఉంటుంది. ఇంతకీ ఈ కార్యక్రమాల్లో లంచగొండితనం చాలా తక్కువగా ఉన్నదని చెబుతున్నాను. ప్రజలసహకారం, పాల్గొనడం విషయం....

శ్రీ బి. శంకరయ్య: లంచగొండితనం తగ్గుతుందా, హెచ్చుతుందా?

మిస్టర్ స్పీకర్: 'అధ్యక్షా' అని నన్ను అడిగితేనే జవాబుచెప్పండి, డైరక్టుగా అడిగితే జవాబు చెప్పనక్కరలేదు. నా అనుమతిని అడిగితే నా discretion ప్రకారం అవసరమని తోస్తే అంగీకరిస్తాను. ఎవరైనా మరొకరు మాట్లాడుతుంటే, distub చేయదలచుకుంటే, నా అనుమతిని తీసుకోవాలి, గౌరవనీయులైన మంత్రులైనా నా అనుమతి తీసుకోవలసినదే.

శ్రీ బి. శంకరయ్య: అధ్యక్షా, తమ అనుమతినే అడుగుతున్నాను.

మిస్టర్ స్పీకర్: అనుమతి ఇవ్వడంలేదు; ముఖ్యమైన విషయంకాదు కనుక.

శ్రీ వి. బి. రాజు: ప్రజల సహకారం సంపూర్ణంగా సంపాదించడానికి ప్రయత్నంచేయాలి. ఇకముందు ఎక్కువగా ఉండగలదని ఆశిస్తున్నాను. పని జరుగుతున్న 185 కేంద్రాలలో ప్రభుత్వ పక్షాన ఇంతవరకు ఆరుకోట్ల రూపాయిలు ఖర్చు అయినవి. ఈ కార్యక్రమం ప్రారంభం అయినప్పటినుంచి 31-3-58 వరకు, అంచనాలబట్టి అయిన దానినిబట్టి, అప్పులతోకలిసి అయిన ఖర్చు ఇది, ప్రజల దగ్గరనుంచి 3 కోట్ల 68 లక్షల రూపాయిలు విరాళంగా వచ్చినది, ఇది పెద్దవిషయం. డబ్బురూపంలోనే కాకుండా వస్తురూపంగాను, శ్రమరూపంగాను వచ్చిన సహకారంఇది. ఇది చిన్నమొత్తంకాదు. దీనిని

5 సంవత్సరాలలో ప్రజలదగ్గరనుంచి రాబట్టగలిగాము. సంతోషంగా వారింత మొత్తం ఇవ్వగలిగారంటే శ్లాఘించవలసిన విషయం. ఇంతకన్నకూడా ఎక్కువ సాధించగలుగుతామనే ఆశఉన్నది. దీనికి కావలిసిన సిబ్బంది గురించి మనవి చేస్తాను. హైస్కూళ్ళలోను కళాశాలలలోను చదువుకుని వచ్చేవారిని ఈ ఉద్యోగాలకు తీసుకుని ప్రయోజనంలేదు. మొదటనే చెప్పాను, మనకు సాంకేతిక సిబ్బంది కావాలని. శిక్షణకు కావలసిన సౌకర్యాలు ఎక్కువచేయాలి. సరిఅయిన మనుష్యులు లేకపోతే ఎన్నిరూపాయిలు ఖర్చుచేసినా ఎంతమంది కార్యక్రమం తయారుచేసినా లాభంలేదు. ఇందుకై రాష్ట్రప్రభుత్వం ఏర్పాటుచేసిన శిక్షణ వసతులు సక్రమంగానే ఉన్నాయి. ఇపుడున్నవసతులు సరిపోతాయి. ప్రతి సంవత్సరం 700 నుండి 800 వరకు గ్రామసేవకులు తయారవుతున్నారు. వారికి సంవత్సరన్నరకాలం శిక్షణ ఇస్తున్నాము. ముఖ్యంగా వ్యవసాయం విషయంలో ఎక్కువ శిక్షణ ఇస్తున్నాము. సంవత్సరం శిక్షణ పొందిన గ్రామ సేవకులు పని బాగానే చేస్తున్నారు. మిగతా రాష్ట్రాలతో పోల్చి చూచుకుంటే మనం వెనుకబడి లేము. మన శిక్షణ వసతులు, శిక్షణ పొందిన సిబ్బందికాని సక్రమంగా ఉన్నదని గట్టిగా చెప్పగలుగుతున్నాను. ఇంత డబ్బు ఖర్చుచేసి ఈ కార్యక్రమంవల్ల సాధించినది, సాధించదలచుకున్నది ఏమిటి ? ఈ కార్యక్రమం పూర్తిఅయే సరికి మంచినీళ్ళ బావి లేని గ్రామం అంటూ ఉండదని ఆశించ బడుతోంది. ప్రాథమిక పాఠశాల లేని గ్రామం ఉండదు. పంచాయితీబోర్డు లేని గ్రామం ఉండదు. సహకార వ్యవస్థ లేని గ్రామం ఉండదు. కచ్చారోడ్డు కాని, పక్కారోడ్డు కాని—ఏదో ఒక రోడ్డుతో కలియని గ్రామం ఉండదు. ప్రతి కేంద్రంలోను విత్తనాల ఫారం, విత్తనాల స్టోరు ఉంటుంది. ప్రతి కేంద్రం లోను ప్రజారోగ్య కేంద్రం, ఒక artificial insemination centre ఉంటుంది. ప్రజారోగ్య కేంద్రంక్రింద మూడు మెటర్నిటీ కేంద్రా లుంటాయి. ఈ కార్యకమం పూర్తి అయ్యేసరికి ఇంతమాత్రం సదుపాయాలైనా ఏర్పడుతాయని ఆశిస్తున్నాము. ఇందులో విజయాలు సాధించ గలుగుతాము. అంతే కాకుండా ఆ ప్రాంతాలలో చిన్న చెరువులు, కుంటలు వంటి మైనర్ ఇరిగేషన్ వసతు లుంటే బాగుపడతాయని ఆశిస్తున్నాము. ఇవి బాగుపడడంవల్ల, ఈ కార్యక్రమాలక్రింద ఇచ్చే అప్పులతో త్రవ్వబడిన బావులవల్ల మైనర్ ఇరిగేషన్ వసతులు పెరిగి సాగుకు వచ్చేభూమి పెరుగుతుందని ఆశిస్తున్నాము. ఈ కార్యక్రమాలు వ్యవసాయాభివృద్ధికి యెంతో తోడ్పడి అధికాహారోత్పత్తికి సహాయం చేస్తాయని ఆశిస్తున్నాము. తక్కిన సాంఘిక పరిజ్ఞానం గురించి వైజ్ఞానిక కార్యక్రమాల గురించి, వాటిద్వారా కలిగే సాంఘిక, వైజ్ఞానిక పురోభివృద్ధి గురించి నేను చెప్పడంలేదు. ఆర్థికంగా మనం వెనుకబడినప్పుడు వైజ్ఞానిక పురోభివృద్ధి సాధించగలమనే విశ్వాసంనాకు లేదు. ఎంతవరకు భౌతికంగా

శారీరక పోషణ జరపమో అంతవరకు సాంస్కృతికాభివృద్ధి పొందాలంటే కష్టం. ఈ కార్యక్రమాల ద్వారా ఆర్థికాభివృద్ధిని సాధించ గలుగుతామని, సాంస్కృతికాభివృద్ధికి ఇది పునాది కాగలదని తప్పకుండా విశ్వసిస్తున్నాము. ఇందులో విజయం సాధించుతాము.

1958-59 వ సంవత్సరానికి ప్రభుత్వం అడిగిన పద్దులనుగురించి మనవి చేస్తాను. రెండవ పంచవర్ష ప్రణాళిక పూర్తి అయేసరికి 447 బ్లాకులలో కార్యక్రమం మొదలుపెట్టాలని అనుకున్నాము. దానిప్రకారం వచ్చేసంవత్సరం 73 యన్. ఇ. యస్. బ్లాకులను ఏర్పాటు చేయాలనే ఉద్దేశంతో యీ అంచనాలు తయారు చేయబడ్డాయి. కాని మెహతా కమిటీ నివేదిక వచ్చినతరువాత కేంద్ర ప్రభుత్వం ఒక కొత్త పద్ధతిని సూచించింది దానిప్రకారం First Stage, Second Stage అని రెండు తరగతుల బ్లాక్స్ ఉంటాయి. యన్. ఇ. యస్. బ్లాక్స్ అనిగాని సి. డి. బ్లాక్స్ అనిగాని ఉండవు. ఇవే First Stage Blocks అవుతాయి. ఇప్పుడున్న Normal Stage Blocks అనేవి Second Stage Blocks అవుతాయి. అందుచేత వీటి బడ్జట్ అంచనాలలో మార్పులు చేయవలసిన అవసరం లేకపోయింది. మొన్ననే భారత ప్రభుత్వంవారుకూడ తెలియచేశారు. 1-4-58 వ తేదీన 18 ఫస్ట్‌స్టేజి బ్లాకులు మాత్రమే మొదలుపెట్టమన్నారు. 5 సంవత్సరములలోపల 18 లక్షల రూపాయలను ఖర్చు పెట్టవలసిన బ్లాకులివి. అంటే ఇప్పుడున్న విధానంలో రెండు రకములయిన మార్పులు జరిగాయన్న మాట. యన్. ఇ. యస్. బ్లాకులు, సి. డి. బ్లాకులు, అనేవాటిని ఇకముందు ఫస్ట్‌స్టేజి బ్లాకులంటారు. ఇదొకమార్పు. 1963 వరకు యీ కార్యక్రమము పొడిగించడమనున్నది రెండవమార్పు. రెండవ పంచవర్ష ప్రణాళికలో కమ్యూనిటీ డెవలప్‌మెంటు స్కీముక్రింద కేటాయింపబడిన దాదాపు 200 కోట్లరూపాయల ఖర్చును దృష్టిలో పెట్టుకుని యీ మార్పు చేయవలసివచ్చింది. యీవిధంగా చేయకపోయినట్లయితే ప్లాన్ స్వరూపాన్నే మార్చవలసి వస్తుంది. 1-4-58 న 18 ఫస్ట్‌స్టేజి బ్లాకులు మాత్రమే ప్రారంభింపబతాయి. 5 సంవత్సరములవరకు 12 లక్షల చొప్పున ఖర్చు చేయవలసిన బ్లాకులివి. ఐతే ఇకముందు ఏర్పాటు చేయు కొత్త పద్ధతివల్ల నాలుగున్నర లక్షల రూపాయలు అప్పువస్తుంది. మొట్ట మొదటి సంవత్సరంనుంచి యీ డబ్బు అందుబాటులో ఉంటుంది. అందువల్ల చెరువులు బాగుచేయించడానికి, కుంటలు బాగుచేయుటకు, ఇతర నీటిపారుదల సౌకర్యాలు కలుగచేయడానికి వ్యవసాయదారులకు ఋణము లివ్వడానికి మొట్టమొదటి సంవత్సరంనుంచి వీలుంటుంది. యీ 12 లక్షల రూపాయలు మనమేవిధంగా ఖర్చుపెట్టాలన్నా మనచేతులలో ఉంటుంది. ఇదివరకు 6 సంవత్సరములలో ఖర్చు చేయవలసిన 12 లక్షల రూపాయలను ఇకముందు 5 సంవత్సరములలో ఖర్చుచేయవలసియున్నది. అందుచేత ఎక్కువడబ్బును

తక్కువకాలంలో ఖర్చుపెట్టవలసిన అవసరం ఏర్పడుచున్నది. 1-4-58 నుంచి 18 ఫస్ట్ స్టేజి బ్లాకులకు కార్యక్రమం మొదలుకావచ్చు. ఇందుతోబాటు కేంద్ర ప్రభుత్వంవారు ఇంకొక సూచన చేశారు. ముందు సంవత్సరం ఫస్ట్ స్టేజి బ్లాకులుగా ఏర్పాటుచేయు ప్రాంతాలలో యీ సంవత్సరమే కొంత కార్యక్రమం ప్రారంభించవలసిఉంటుంది. ఆ ప్రాంతములలో సర్వేపని మొదలైనవి ముందు చేయవలసి ఉంటుంది. ఒక అగ్రికల్చరల్ ఎక్స్టెన్షన్ ఆఫీసరును, 5 గురు గ్రామసేవకులను నియమించి, 10 వేల రూపాయల ఖర్చుతో అక్కడ కొంత పని జరిపిస్తారు. ఇది ప్రి ఇన్టెన్సివ్ వర్కు. ఇటువంటి బ్లాకులను ఈ సంవత్సరం 13 ను మొదలుపెట్టవలసి ఉంది. అంటే 18 ఫస్ట్ స్టేజి బ్లాకులు, 13 ప్రి ఇన్టెన్సివ్ డెవలప్ మెంటు బ్లాకులు, వచ్చే ఆర్థిక సంవత్సరంలో మొదలు పెడతారు. అంటే మొత్తం 31 బ్లాకులు ఏర్పాటు చేయవలసి ఉంటుంది. యీ కార్యక్రమంయొక్క వివరములన్నీటిని భారత ప్రభుత్వంవారు తయారుచేసి, మనకు ఉత్తర్వులు పంపుతారు. ఆ ఉత్తర్వులు యీ వారంలోగా రావచ్చు. మొట్టమొదటి కార్యక్రమాన్ని దృష్టిలో పెట్టుకుని యీ అంచనాలు తయారు చేయబడినవి. కేంద్ర ప్రభుత్వంవారు సూచించిన మార్పులవల్ల యీ అంచనాలలో కూడా కొన్ని మార్పులు రావచ్చు అవసరమయినట్లయితే సప్లిమెంటరీ డిమాండ్సును ఈ శాసనసభ ముందుకు తేవలసియుంటుంది. ఈ బడ్జెటు ఎస్టిమేట్లు తయారుచేసిన తరువాత వచ్చిన సూచనల గురించి తెల్లియచేశాను. ఇప్పటికే నేను ఎక్కువ సమయం తీసుకున్నాను. నేను సభ ముందుంచిన ఈ ప్రతిపాదనను సానుభూతితో పరిశీలించి, నిర్మాణాత్మకమైన విమర్శలు చేసినట్లయితే ఉపయోగకరంగా ఉంటుంది. ఏవో కొన్ని లోపాలు అక్కడున్నాయి, కొన్ని ఇక్కడున్నాయి అని చెప్పినంతమాత్రాన సరిపోదు. లోపాలు లేవని నేను చెప్పడంలేదు. గోరంతవాటిని కొండంతగా చేయడం మంచిదికాదు. ఈ కార్యక్రమం గురించి విమర్శించేటప్పుడు దానిలో పనిచేసే వారిని నిరుత్సాహ పరచని విధంగాను, వారు ఎక్కువ శ్రద్ధబూని ప్రజల అభిమానాన్ని చూరగొనుటకు ఉత్సాహం కలిగే విధంగా విమర్శించమని కోరుతున్నాను. అటువంటి విమర్శలు చేసి ఈ పద్దును ఆమోదించినట్లయితే ప్రభుత్వం తరఫున నా కృతజ్ఞత వెలిబుచ్చగలుగుతాను.

మిస్టర్ స్పీకర్ : ఇపుడు కోత తీర్మానాలను ప్రతిపాదించవలెనని కోరుచున్నాను.

*Sri Vavilala Gopalakrishnayya* (*Sattenapalli*) : Mr. Speaker, Sir, I beg to move :

To reduce the allotment of Rs. 3,27,11,000 for Community Development Projects, N. E. S. and Local Development works by Rs. 100

(To discuss the policy.)

*Sri G. Suryanarayana (Gajapathinagaram - Reserved)*: Mr. Speaker, Sir, I beg to move :

To reduce the allotment of Rs. 3,27,11,000 for Community Development Projects, N. E. S. and Local Development works by Rs. 100

(గజపతి నగరంలో యింతవరకు కమ్యూనిటీ బ్లాకులుగాని యితర బ్లాకులుగాని లేనందుకు, యీ విషయము ప్రభుత్వ దృష్టికి తీసుకురాగలందులకు)

*Sri A. Yeruku Naidu (Salur-General):* Mr. Speaker, Sir, I beg to move:

To reduce the allotment of Rs. 3,27,11,000 for Community Development Projects, National Extension Service and Local Development works by Rs. 100

(To Criticise the Government policy for not establishing N. E. S. Blocks in many taluks especially Agency areas and backward areas so far.)

*Sri M. Satyanarayana Raju (Cheepurupalli-General)* : Mr. Speaker, Sir, I beg to move :

To reduce the allotment of Rs. 3,27,11,000 for Community Development Projects, National Extension Service and Local Development works by Rs. 100

(For the failure of Government to get Co-operative Societies functioned in Shermahammadpuram Block area.)

To reduce the allotment of Rs. 3,27,11,000 for Community Development Projects, National Extension service and Local Development works by Rs. 100

(For the failure of the Government to fix the Block Head Quarters helpful to the people of Block area.)

*Sri Pillalamarri Venkateswarlu (Nandigama)* Mr. Speaker, Sir, I beg to move :

To reduce the allotment of Rs. 3,27,11,000 for Community Development Projects, National Extension Service and Local Development works by Rs. 100

(For the failure of the Government to reduce the contribution to be made by the villagers in L. D. with N. E. S. and C. D. Projects and to fix at not more than 1/4 in cases of backward and dry areas.)

*Sri P. Satyanarayana (Samalkota)*: Mr. Speaker, Sir, I beg to move :

To reduce the allotment of Rs. 3,27,11,000 for Community Development, National Extension Service and Local Development works by Rs. 100

(ప్రభుత్వం విధానం విమర్శించుటకు)

*Sri G. Ganga Reddy*: Mr. Speaker, Sir, I beg to move :

To reduce the allotment of Rs. 3,27,11,000 for Community Development Projects, National Extension Service and Local Development works by Rs. 100

(ఎన్. ఇ. ఎస్. బ్లాకులు నిర్మల్, ముధోల్ తాలూకాలలో యివ్వ లేనందులకు)

*Sri V. Visweswara Rao (Mylavaram)* : Mr. Speaker, Sir, I beg to move :

To reduce the allotment of Rs. 3,27,11,000 for Community Development Projects, N. E. S. and Local Development works by Rs. 100

(స్థానికాభివృద్ధి పనులకు కేటాయించే మొత్తాలను సకాలంలో జిల్లాలకు పంచక ఆఖరు నిమిషంలో ఎలాటుచేసి ఖర్చుపెట్టలేక మురిగిపోగొట్టుటను గురించి)

To reduce the allotment of Rs. 3,27,11,000 for Community Development Projects, National Extension Service and Local Development works by Rs. 100

(ప్రణాళికలో పేర్కొన్నట్లుగా కృష్ణాజిల్లాలో 40 శాతము సి. డి. బ్లాకులను ఏర్పరుచుటలో ప్రభుత్వ విఫలతనుగురించి)

To reduce the allotment of Rs. 3,27,11,000 for Community Development Projects, National Extension Service and Local Development works by Rs. 100

(సమాజ వికాసకేంద్రాలలో రైతులకు వ్యవసాయ పనిముట్లు అంద చేయుటలో జరుగు జాప్యమును గురించి)

To reduce the allotment of Rs. 3,27,11,000 for Community Development Projects, N. E. S. and Local Development works by Rs. 100

(సమాజ వికాస కేంద్రాలలో రైతులకు వ్యవసాయాభివృద్ధి అప్పులు యిచ్చుటలో జరుగు జాప్యమునుగురించి)

To reduce the allotment of Rs. 3,27,11,000 for Community Development Projects, National Extension Service and Local Development works by Rs. 100

(సమాజ వికాస కేంద్రాలలో నీటివనరుల అభివృద్ధికి ఎక్కువ మొత్తం కేటాయించకపోవుటను గురించి)

To reduce the allotment of Rs. 3,27,11,000 for C. D. P., N. E. S, and L. D. works by Rs. 100

(కమ్యూనిటీ డెవలప్ మెంటు కేంద్రాలలో నాయకుల శిక్షణ శిబిరములకు అందరూ గ్రామ నాయకులే తమ రేషనులు తెచ్చుకోవలెననే సూత్రం శిక్షణ శిబిరములు నామమాత్రం చేయుటనుగురించి)

To reduce the allotment of Rs. 3,27,11,000 for C. D. P., N. E. S., and L. D. Works by Rs. 100

(సమాజ వికాస కేంద్రాలలో గృహపరిశ్రమల అభివృద్ధికి తగు ప్రోత్సాహం కలుగచేయనందులకు)

To reduce the allotment of Rs. 3,27,11,000 for C. D. P., N. E. S., and L. D. works by Rs. 100

(సమాజ వికాస కేంద్రాల సలహా సంఘాలతో వివిధ రాజకీయ పార్టీల సభ్యులకు స్థానం యివ్వకపోవుటను గురించి)

*Sri Uppala Malchur (Suryapeta - Reserved)*: Mr. Speaker, Sir. I beg to move:

To reduce the allotment of Rs. 3,27,11,000 for C. D. P., N. E. S., and L. D. works by Rs. 100

(సూర్యాపేట తాలూకాలో (ఎన్. ఇ. ఎస్.) జాతీయ విస్తరణ కేంద్రంలోని గ్రామాల అవసరాలకొరకు చేయవలసిన పనులను సక్రమంగా సకాలంలో చేయనందుకు)

*Sri Banappa (Makthal - Reserved)*: Sir, I beg to move:

To reduce the allotment of Rs. 3,27,11,000 for C. D. P., N. E. S., and L. D. works by Rs. 100

(5 సంవత్సరాలక్రితం మెదకు జిల్లాకలెక్టరయున అబ్దుల్ ఖాదర్ గారు యస్. ఇ. ఎస్. ఆంధోలులో ప్రారంభింపవలసినదని వ్రాసినను ప్రభుత్వము చేయలేని పరిస్థితిని విమర్శించ)

To reduce the allotment of Rs. 3,27,11,000 for C. D. P., N. E. S., and L. D. works by Rs. 100

(ఆంధోలు తాలూకాలో ఖాదిరాబాదు, పాపన్నపేట, దేవునూరు, రేగోడు మొదలయిన ఆర్. ఐ. హల్కాల ముఖ్య గ్రామాలకు రోడ్డు వేయించ కోరినను ప్రభుత్వము చేయలేని తనమును విమర్శించ)

To reduce the allotment of Rs. 3,27,11,000 for C. D. P., N. E. S., and L. D. works by Rs. 100

(10 సం॥ల నుండి దేవునూరు ప్రాజెక్టుపనులు ముగించని విధానమును విమర్శించగలందులకు)

*Sri K. Rajamallu* (*Sirpur - General*): Mr. Speaker, Sır, I beg to move:

To reduce the allotment of Rs. 3,27,11,000 for C. D. Projects, N. E. S., and L. D. works by Rs. 100

(To dıscuss the progress ın N. E. S. Blocks.)

*Sri S. V. K. Prasad* (*Chennur*): Mr. Speaker, Sir, I beg to Move:

To reduce the allotment of Rs. 3,27,11,000 for C. D. P., N. E. S., and L. D. works by Rs. 100

(కమ్యూనిటీ డెవలప్‌మెంటులో ఎక్కువ డబ్బు అధికారవర్గం, బిల్డింగులపై ఖర్చుపెట్టే పద్ధతిలో మార్పు తేలేకపోవటాన్ని విమర్శించుటకు)

To reduce the allotment of Rs. 3,27,11,000 for C. D P., N. E. S., and L. D. works by Rs. 100

(బ్లాకులలో ఏర్పరుస్తున్న సలహా సంఘాల్లో వివిధ పద్ధతులద్వారా అధికారపార్టీ వారితో నింపుటగురించి విమర్శించుటకు)

To reduce the allotment of Rs. 3,27,11,000 for C. D. P,, N. E. S., and L. D. works by Rs. 100

(కమ్యూనిటీ మొదలగు బ్లాకులలోని అధికార్లు, ఇతర అధికార్లమధ్య సమన్వయం లేకపోవటంవల్ల పరిపాలనలో జరుగుచున్న చిక్కులను విమర్శించుటకు)

*Sri B. P. Sesha Reddy* (*Koilkuntla*): Mr. Speaker, Sir, I beg to move:

To reduce the allotment of Rs. 3,27,11,000 for C. D. P., N. E. S., and L. D. works by Rs. 100

(Some of the taluks in Andhra State are not covered by at least one N. E. S. Block, though more number of N. E. S. Blocks are given to some of the taluks.)

To reduce the allotment of Rs. 3,27,11,000 for C. D. P., N. E. S., and L. D. works by Rs. 100

(There is waste of funds under Village Communications as no provision is made for their maintenance.)

*Sri S. V. K. Prasad*; Mr. Speaker, Sir, I beg to move:

To reduce the allotment of Rs. 3,27,11,000 for C. D. P., N. E. S., and L. D. works by Rs. 100

(To discuss the failure of the Government in allotting N.E.S. Blocks to the Warangal district on the basis of its population.)

To reduce the allotment of Rs. 3,27,11,000 for C. D. P., N.E.S., and Local Development works by Rs. 100

(To discuss the pitiable condition of people in the Baswapur colony in Mulug Community Project.)

To reduce the allotment of Rs. 3,27,11,000 for C. D. P., N. E. S., and L. D. works by Rs. 100

(To discuss the failure of the Government to promote Village Industries specially the lack of progress of Pilot Project in Mulug C.D. Block, Warangal district.)

To reduce the allotment of Rs. 3,27,11,000 for C. D. P., N. E. S., and L.D. works by Rs. 100

(To discuss the failure of Narsampet Multipurpose Block in not having enough progress.)

*Sri B. Dharma Bhiksham (Nakerkal)*: Mr. Speaker, Sir, I beg to move:

To reduce the allotment of Rs. 3,27,11,000 for C, D. Projects N. E. S. and L. D. works by Rs. 100

(పంచాయితీ కమిటీల ద్వారా ఎన్. ఇ. ఎస్. అండ్ సి. డి. స్కీములను అమలుపరచునట్లు చేయుట గురించి చర్చించుటకుగాను.)

ప్రతి ఎన్. ఇ. ఎస్., సి. డి. బ్లాకులలోని పంచాయితీ అధ్యక్షులు లేక కమిటీల ప్రతినిధులు ఆ నియోజకవర్గ ఎమ్. ఎల్. ఏ అన్ని రాజకీయ పార్టీ సమాన సంఖ్యలో కూడిన ప్రతినిధులు ఆ స్థాయిలోని ప్రభుత్వాధికార్లతో సలహా కమిటీ వేయటం గురించి)

To reduce the allotment of Rs. 3,27,11,000 for C. D. Projects N. E. S. and L. D. works by Rs. 100

(నల్లగొండ జిల్లా ప్లానింగ్ కమిటీలో కమ్యూనిస్టు పార్టీకి ప్రాతినిధ్యమివ్వటంలో చూపిన పక్షపాత వైఖరిని చర్చించుటకుగాను)

To reduce the allotment of Rs. 3,27,11,000 for C. D. Projects N. E. S. and L. D. works by Rs. 100

(ఎన్. ఇ ఎస్. అండ్ సి. డి. బ్లాకులలో పంచాయితీలకు ప్రభుత్వ ప్రచార శాఖ పత్రికలు, గెజట్సు, బులెటిన్సు, స్టాటిస్టికల్ బులెటెన్స్ సప్లయి చేయుట గురించి)

*Mr. Speaker*: All these cut motions are now before the House

*శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య : అధ్యక్షా, మంత్రిగారు ఈ డిమాండును ప్రతిపాదిస్తూ ఒక new set-up ను మనముందు పెట్టారు. ఈ మొత్తం విధానం మారుతుందని 1968 వరకు యిది వెళ్లుతుందని చెప్పారు. ఇది హర్షించడానికి ఏమాత్రం వీలులేదు. విచారించి ప్రయోజనంలేదు.

శ్రీ వి. బి. రాజు:- 1963 వరకు మొదలు పెట్టడం పూర్తి అవుతుంది. మొదలుపెట్టిన బ్లాక్సు పూర్తికావాలంటే 1968 వరకు పట్టుతుందని చెప్పాను. అంటె Second Plan 1961 కి పూర్తి అవవలసియుంటే, అప్పటికి పూర్తిచేయ వలసిన కార్యక్రమం, యింకొక రెండు సంవత్సరాలు అనగా 1963 వరకు extend అవుతుంది.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య : అందువల్ల రెండవప్రణాళికలో పూర్తి కావలసిన ఈ కార్యక్రమంలో మార్పు వచ్చిందని చెప్పారు. Post intensive C. D. & N. E S. Blocks విధానం మార్చి - రెండు విధాల చేస్తామన్నారు. అది బలవంతరాయ్ కమిటీ సూచన అన్నారు. అంతవరకు బాగానే ఉన్నదని నా అభిప్రాయము. కాని దీనిని అమలుజరిపే విధానంలో, అంత సుముఖంగా లేదేమోననిపిస్తుంది. ముందు కూర్చున్నవానికి వడ్డన బాగా జరిగి, ఆఖరున కూర్చున్నవానికి ఏమీ ఉండదు - అనే పద్ధతిలో జరిగింది. ఈ బ్లాక్సును నిర్ణ యించడంలో, political motives మీద ఆధారపడి నిర్ణయం జరిగినందున, political motives సాధించలేనివారు, ఇందులో చాలా వెనక్కు వెళ్ళిపోయారని బోధపడుతుంది. మనకు యిప్పుడు యిచ్చిన మొత్తంలో తగ్గడం exchange కారణం - అని అన్నారు. ఆ exchange కారణం, ఈ రెండుమూడు నెలల్లో వచ్చిన వివరాలనుబట్టి సర్దుకొన్నదని అనుకొంటాను.

ఈ బ్లాక్సు, Social Welfare State లో చాలా మంచివి అన్నారు. అది నేను పూర్తిగా అంగీకరిస్తాను. కీ. శే. శనివారపు సుబ్బారావుగారు ఆంధ్ర ప్రాంతంలో 1923 సంవత్సరములో, తాడేపల్లిగూడెములో ఉపాధ్యాయులకు పాఠశాలలు ప్రారంభించి వయోజనవిద్య, గ్రామోద్ధరణ, గ్రామ పునర్నిర్మాణ ఉద్యమములో శిక్షణ యిచ్చారు. ఆయన ఈనాడు లేడు. ఆయన ఉంటే ఆ కార్యక్రమము కొంతైనా ఇప్పుడు జరుగుతున్నందుకు ఎంతోసంతోషించేవారు. ఈ సందర్భంలో వారికి జోహార్లు సమర్పించక తప్పదు. కీ. శే. ప్రకాశంగారు

కూడా Firka Development విధానం ప్రవేశపెట్టియుండిరి. అదికూడాపోయినది. ఇప్పుడు ఈ కార్యక్రమం intensify చేశారు. ఇది ఆంధ్రప్రాంతమునకు క్రొత్తది కాదు. దీనికి కీ. శే. ప్రకాశంగారు దారి చూపించినందుకు జోహార్లు సమర్పించక తప్పదు. అసలు డెమాక్రసీ మూడు భాగాలుగా కనబడుతుంది—(1) ప్రజలచేత ప్రతినిధులు ఎన్నుకోబడటం, (2) ప్రజలచేత ఎన్నుకోబడ్డవారు పనిచేస్తున్నారా లేదా నిర్ణయించేందుకు దానికి referendum ఉండటం, (3) ఇది పరిపూర్ణం ఎప్పుడు అవుతుందంటే—ప్రజాస్వామ్య నిర్వహణంలో ప్రజలు కూడా పాల్గొంటేనే అవుతుంది. దానికి యిది అవకాశం యిస్తుంది. అంతవరకు యిది సూత్రప్రాయంగా బాగున్నదని ఒప్పుకోనక తప్పదు. అయితే యిప్పుడున్న కార్యక్రమం సక్రమంగా ఎందుకు జరుగుటలేదు ? కీ. శే. సుబ్బారావుగారి టైములో కొన్ని కార్యక్రమాలు తీసుకొన్నప్పుడు ప్రభుత్వం నుంచి సహకారం లేదు. ప్రభుత్వం ఎడమొఖం పెడమొఖం పెట్టింది. ఈ విధానం ప్రమాదమైనది. అప్పటి ప్రభుత్వం అర్థం చేసుకొన్నది. కాని ఈనాడు ఆ కార్యక్రమమునకు మరొక రూపము వచ్చింది. ప్రభుత్వం నిర్వహిస్తున్న కార్యక్రమమునకు ప్రజల సహకారం రావడంలేదు ఇవి తీసివేయమని, ఈ waste ఎందుకని — అంటున్నారు. అది నేను అంగీకరించను. ఆ భావం ఉండటం న్యాయం కాదనికూడ చెబుతున్నాను. దీనికి బాధ్యత రెండు వైపుల ఉన్నది: (1) ఈ కార్యక్రమమును అమలు జరిపే machinery (2) ప్రజాప్రతినిధులైన శాసనసభ్యులుగాని, పార్లమెంటు సభ్యులు గాని దీనిని ప్రజాస్వామిక నిర్వహణలో ఒక భాగంగా గుర్తించకుండా, తమకు కావలసిన పనులకు ఉపయోగించడం - అందరినీ నేను అనడంలేదు, కొందరు బాగా పనిచేస్తున్నవారు లేకపోలేదు. వారికి నా అభినందనలు ఎప్పుడూ ఉన్నవి. ప్రభుత్వం దూరముగా కూర్చోవడంవల్ల విఫలం అవుతోంది. ఈ రెండూ సమన్వయం అయితేగాని పూర్తికాదు. ప్రభుత్వం, ప్రజానీకంకూడా తోడ్పడాలి. అప్పుడే ఈ కార్యక్రమం పూర్తిగా జయప్రదమవుతుంది. ఆ దృక్పథంతో ఆలోచించాలని మనవిచేస్తున్నాను. కొన్నిచోట్ల చాలా జయప్రదంగా సాగుతున్నది. ఉదాహరణకు పెందుర్తి బ్లాకులో పనిబాగా జరుగుతోంది. గ్రామాలకు కావలసిన రోడ్లపని పూర్తిచేశారు. అక్కడ అందరు ఆఫీసర్సు, Social Welfare ఆఫీసరునుంచి, B.D.O. నుంచి Village Level Worker వరకు ఒకటీమ్‌స్పిరిట్‌తో జయప్రదంగా నడుపుతున్నారు. గ్రామాలలో ఏ నిర్ణయం తీసుకొన్నా మహాసభలో అందరు చేరి నిర్ణయం తీసుకొని ఉత్సాహంగా పనిచేస్తున్నారు. అన్నిచోట్ల అట్లాచేస్తే బాగుంటుంది. వారికి తమద్వారా అభినందనలు తెలుపుతున్నాను. వేరే కొన్ని విఫలమయినచోట్లు లేకపోలేదు. గద్వాల్ ప్రాంతంలో urban area కు concentrate చేశారు. చేసే సౌకర్యాలు పట్టణాల్లో చేశారు.

అనేకచోట్ల అక్కడఉన్న members రాజకీయాలకు వారి వ్యక్తిగత గౌరవానికి పలుకుబడికి ఉపయోగించే పద్ధతిలో డబ్బును వినియోగిస్తుంటే, అక్కడ ఈ కార్యక్రమం విఫలమవుతోంది. మంత్రిగారు ఉత్సాహంగా చెప్పారు. లంచ గొండితనం లేదన్నారు. ఉండటానికి వీలులేదు కూడా. అయినా అవకాశం ఉన్నచోట్ల పోనివ్వలేదు. విద్యచెప్పేచోట్ల లంచం తీసుకొనుటకు వీలులేదు. అక్కడ చేయించవలసిన పనులు ప్రజలకు యిస్తామంటున్నారు. ఆ అభిప్రాయం సరైనదే, కాని application వచ్చేటప్పటికి ఏ వ్యక్తికో యివ్వక తప్పుటలేదు. అప్పుడు, ఆఫీసర్సు తమ భాగాలు లెక్కచూచుకొనకుండా చేయడంలేదు. అసలు పనికన్న ఎక్కువ అంచనాలు వేయుట మానుకోలేదు. ఇది generalise చేసి, నేను sweeping remark చేయడంలేదు. కొన్నిచోట్ల ఈ works లో లోపాలకు గ్రూపు రాజకీయాలు, పార్టీరాజకీయాలే ప్రధానకారణమని చెప్పకతప్పదు. గ్రామజీవితములో మార్పులు తీసుకురావాలి. వ్యవసాయ జీవితంలో మార్పు రాలేదు. ఉత్సాహం మాత్రం వచ్చింది. నెహ్రూగారు చెబుతూ practical గా మార్పుకన్నాకూడా సైకలాజికల్‌గా అక్కడ వాతావరణంలో మార్పు తీసుకురావడానికి ప్రయత్నం చేస్తున్నామన్నారు. దానితో పరిపూర్ణంగా అంగీకరిస్తాను. ప్రజలుకూడా పాల్గొని తమ సోషలిస్టు స్టేటును స్థాపించుకొని నిర్వహించుకొనుటకు ప్రయత్నము చేయవలసి యున్నది. కాని కార్యక్రమములు అమలు జరిపేందుకు రెవిన్యూ డిపార్టుమెంటునుంచి, యితరచోట్లనుంచి ఆఫీసర్సును తెచ్చిపెట్టితే, వారు పాతపద్ధతులలోనే నడుపుతున్నారు. ఒకరిమీద ఒకరు పెత్తందార్లు అనుకుంటారు. మీటింగులు మాత్రము బహుజాస్తి. బ్లాకు డెవలప్‌మెంటు కమిటీలు ఉన్నవి. ఇవి చేసేపని ఏమీలేదని చెబుతున్నాను. ఎందుకంటే నేనుకూడా ఒక కమిటీ మెంబరునే. ఆ కమిటీలో అంకెలు తీసుకు వచ్చి మాకు చూపిస్తారు. అవి ఒప్పుకోక తప్పదు, ఒప్పుకోకపోతే మేము అక్కడకు వెళ్ళనూ అక్కర్లేదు. "అవి ఎటానమస్‌గా లేవు. అందువల్ల మేము కమిటీ వేస్తున్నాము. వాటిని మారుస్తున్నాము" అని చెప్పారు. ప్రజా పరిపాలనా విధానంలో జిల్లాకు ఒక ప్రాముఖ్యత ఉన్నది. దానిని మరచిపోవడానికి ప్రయత్నం చేస్తేమాత్రం, దీనిని మొత్తం వ్యతిరేకించాల్సి వస్తుంది. ఆ ఉద్దేశం కాకుండా, బ్లాక్‌వరకు ఇప్పుడు ఉన్న నామినేషన్ బోర్డుకన్నా, పంచాయితీ బోర్డుల ప్రసిడెంట్లు అక్కడఉంటారు. అంటే, కొంతలోకొంత రిప్రజెంటేటివ్‌గా ఉంటుంది. దానిని అంగీకరించటానికి నాకు అభ్యంతరం లేదు. వారికి సర్వాధికారాలు ఉండకపోతే మాత్రం లాభంలేదు. వారికి సర్వాధికారాలు ఉండవలసిందే. వారికి సర్వాధికారాలు ఇస్తామంటున్నారు మంచిదే. గ్రామ పంచాయితీలకు ఎక్కువ అధికారాలు ఇచ్చినపుడు, గ్రామ పంచాయితీల మీద ఇది పెత్తందారుగా కాకుండా ఉండేటట్టువంటి ప్రయత్నం మనం చేయాలి. నిన్న

శ్రీ బాటం శ్రీరామమూర్తిగారు చెప్పిన దానిని బట్టి చూస్తే, బహుశా పంచాయితీల అధికారాలు కాన్‌స్టిట్యూషన్ ఇచ్చినదానికి అక్రమం జరుగుతుందేమోనని, వారు అనుకొనిఉంటారు. కాని దాంట్లో ఉన్న విషయము ఇది—పంచాయితీలు ఎటానమస్‌గా, అభివృద్ధి కావటానికి అవకాశం ఇవ్వాలని కాన్‌స్టిట్యూషన్ చెప్పింది. "పంచాయితీల బడ్జెటు వగైరా యీ కమిటీలు చర్చచేస్తాయి; నిర్ణయిస్తాయి." అన్నారు. అవి చేసిన నిర్ణయాలను కొట్టివేయటానికి కూడా వీలుంటుం దన్నారు. అందువల్ల దానిని నేను హర్షించటం లేదు.

అసెంబ్లీ మెంబర్లు బ్లాక్ కమిటీస్‌లో కూడా మెంబర్సుగా ఉంటారని సూచించారు. కాని వారు ఓటులేని మెంబర్లు. ఆ ఓటులేని మెంబర్సును ఉంచటం న్యాయంకాదు. ఉంచితే, వారిని పూర్తి ఓటుహక్కు గల మెంబర్సుగా నైనా ఉంచండి. లేకపోతే వారు ఉండనక్కరలేదని అయినా చెప్పండి. కాని వారు కూడా ఉంటే ఉపయోగపడుతుంది అనే అభిప్రాయం ప్రభుత్వం అంగీకరించింది కనుక, వాళ్ళకుకూడా ఓటు ఉండే పద్ధతి ఆలోచించండి.

జిల్లాకమిటీలు ఉన్నవి. జిల్లాకమిటీలు ఎడ్వయిజరీ బోర్డ్సుగా, కలెక్టర్స్‌ను అధికారులుగా, తీసుకొస్తాము అని అంటేమాత్రం, నేను పూర్తిగా వ్యతిరేకించక తప్పదు. ఈ నాడు గవర్నర్ సర్వాధికారి కాడు. రాష్ట్రపతి సర్వాధికారి కాడు. కాని జిల్లాలో కలెక్టర్ సర్వాధికారిగా కూర్చుంటున్నాడు. ఇప్పుడు ఉన్నటువంటి ప్రజాస్వామ్య నిర్వహణకు ఇది అభ్యంతరం, ప్లానింగ్‌కుకూడా పూర్తిగా అభ్యంతరం అని చెబుతున్నాను. అందువల్ల కమిటీస్‌ను మార్పు చేసినపుడు ఎలెక్టెడ్ చైర్‌మన్ ఉండేటటువంటి పద్ధతి ఉండితీరాలి. అది ఎడ్వయిజరీ కమిటీగా ఉండటానికి ఏమాత్రం వీలులేదు అనేది ప్రభుత్వానికి మీ ద్వారా నేను మనవి చేస్తున్నాను. ఈ బ్లాక్ కమిటీస్‌లో వర్కర్సు ఉన్నారు, బ్లాక్ మీటింగు, స్టాఫ్ మీటింగ్, డిస్ట్రిక్ట్ కమిటీ మీటింగ్—ఈ మీటింగ్‌లకు ఆఫీసర్సు తిరిగే టప్పటికల్లా, వీళ్ళకు చాలా ఖర్చు అవుతున్నది. రోజులు గడుస్తున్నవి. దీంట్లో ఒక ప్రమాదము ఉన్నది. దానిని మనం ఎదుర్కోవలసిన అవసరము ఉన్నది. నేను కొన్ని బ్లాక్స్ తిరిగాను. చాలా బ్లాక్స్ తిరగటానికి కూడా, ప్రయత్నం జరిగింది. అక్కడనేను ఒకసంగతి చూశాను.

Woman Social Welfare Officer is a bone of contention and the jeep is a question of quarrel.

అదిమాత్రం మరచిపోవద్దు. ఆమె అక్కడ ఉంటే, ఆమెతో సహా ఏకారులో ఎక్కుదామా—

శ్రీ ఇ. అయ్యపురెడ్డి (నందికొట్కూరు - జనరల్) : సభ్యులు Woman Social Welfare Officer ...bone of contention...

అని ఏదో కొటేషన్ చెప్పారు. అది కొటేషనా? లేక వారి స్వంతమా? అది పార్లమెంటరీయేనా అని అడుగుతున్నాను.

మిస్టర్ స్పీకర్ : అది ఏమిటి?

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య : అయ్యా, అది ఒకరు చెప్పారండి.

మిస్టర్ స్పీకర్ : ఏమిటి?

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య : "Bone of contention" అని.

మిస్టర్ స్పీకర్ : ఏమని? ఎందుకు?

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య : స్త్రీ అక్కడ ఉంటే, "నేను జీపు ఎక్కటమా, నేను జీపు ఎక్కటమా" అని పోట్లాడుకొంటున్నారు; "పని చెడిపోతున్నదండి" అని ఆఫీసర్లు చెప్పారు. స్టాఫ్ మీటింగ్స్ తగ్గించేటటువంటి ప్రయత్నం చేయవలసి ఉన్నది. అందువల్ల ఖర్చుకూడ తక్కువ అవుతుంది.

ప్రజానీకపు అప్పులసమస్య ఇంతవరకు తీరలేదు. ప్రభుత్వంవారు అప్పులు ఉన్నవాడికే ఇస్తున్నారు. అందువల్ల అసలు పరిష్కారమార్గం దొరకటంలేదు. భూసంస్కరణల విషయం ఆలోచిస్తే, దీనికి ఏవిధమైన ప్రయత్నం జరగటం లేదు. ఆ వైపు మనం కాన్సెన్ట్రేట్ చేయకపోతే, ట్యాక్స్ పెట్టిన ఉపయోగం, నిరుపయోగము అవుతుందని చెబుతున్నాను. వెనుకబడిన జాతులవారికి ఎవరికీ ఈ అప్పులో ఒక దమ్మిడీకూడ చేరటంలేదని చెబుతున్నాను. వ్యవసాయ కూలీలకు అసలు దమ్మిడికూడా ప్రయోజనం జరగటంలేదని చెబుతున్నాను. దీనిని ప్రభుత్వంవారు జ్ఞాపకం పెట్టుకోకపోతే లాభంలేదు. కమిటీస్‌లో వ్యవసాయకూలీలకు, వెనుకబడిన వాళ్ళకు చోటులేదు. ప్రధానంగా వాళ్ళకు కమిటీస్‌లో చోటుఇస్తేగాని లాభంలేదని మెహతా కమిటీ చెబుతున్నది; ప్లానింగ్ వారుకూడ చెబుతున్నారు. కాని అమలుజరిగేటప్పుడు మాత్రం వాళ్లను మరచిపోతున్నారని మనవిచేస్తున్నాను.

గ్రామ పారిశుధ్యం ఉన్నది. గ్రామ పారిశుధ్యానికి ఐదు సెంటర్స్ ప్రత్యేకంగా నిర్ణయించామన్నారు. అక్కడ లెట్రిన్స్ కట్టారుగాని, సెప్టిక్ టాంక్స్ మాత్రం కట్టలేదు. ఒకదానినెత్తిన ఒకటి కట్టారు. అవి కుష్కదండుగ అని అంటే తప్పులేదేమో. ఆవిధంగా మాచెర్లబ్లాకులో జరిగింది. అదిచూచి సరిచేయకపోతే మాత్రం, పబ్లిక్‌డబ్బు వేస్ట్ అయినట్లు అవుతుందని మనవి చేస్తున్నాను.

గృహసమస్య ఇంతవరకు పరిష్కారము కాలేదు. దానిమీద మనం కాన్సెన్ట్రేట్ చేయటంలేదు.

విద్యావిధానంలో బేసిక్ విద్యావిధానమని ఒకటి ఏర్పాటుచేయటమే గాని, దానికి కావలసిన బేసిక్ నీడ్స్ ఒక్కటీకూడ ఇవ్వాళ్టివరకు ఇచ్చిఉండలేదు. బిల్డింగ్స్ కార్యక్రమం మాత్రం జరుగుతున్నది. దానివల్ల విద్యావిధానం దెబ్బతింటున్నది దానిని మనం మార్చే ప్రయత్నం చేయకపోతే లాభంలేదు. గ్రంథాలయ బిల్డింగులు దీంట్లో కట్టటానికి వీల్లేదని చెప్పారు. దానికి అవకాశం ఇవ్వకపోతే నిష్ప్రయోజనం అవుతుంది. సంస్కృతి కళలకు కావలసింది ప్రధానంగా పరిగణించకుండా, కళలను ప్రచారంకొరకు మాత్రం ఉపయోగ పరుస్తున్నారు. ఒకసారి డా. బెజవాడ గోపాలరెడ్డిగారు చెప్పారు. "ప్లానింగు ప్రచారమే కళలైతే, ఇక దేశంలో కళలు లేకుండా పోతాయి" అని వారు అన్నారు. ప్రచారం చేయటానికి ఈ కళలను ఉపయోగపర్చటం మంచిదే గాని, అసలుకళలను ఇందుకు ఉపయోగిస్తే ఆ కళలు నిష్కళలు అయిపోతాయేమోనని భయపడుతున్నాను. ఆ విధానాన్ని మార్పుచేయాలనిచెబుతున్నాను.

ఈ ప్రణాళికలు అమలు జరపటానికి ప్రజలు ఇంతవరకు ఊరికే నామకః పార్టిసిపేట్ చేస్తున్నారుకాని, కావలసినంతగా పాల్గొనడంలేదు. నాకు ఒక విశ్వాసం ఉంది. ప్రజలు పాల్గొనిఉంటే ఏ పని అయినాసరే, దానిని భద్రంగా వాడుకొనేవారు ప్రజలు అవుతారు, లేక అచ్చం గవర్నమెంటు చేసేటట్లయితే "అది గవర్నమెంట్ పని" అని అంటారు. "ఇది మాకేమీ సంబంధం లేదు. అదేదో గవర్నమెంటుది కనుక, వాళ్లే చూసుకొంటారు, అని ప్రజలు అంటున్నారు" అని బల్వంతరాయ్ మెహతా రిపోర్టులోకూడ వారు వ్రాశారు. ప్రజలు పాల్గొనుటకు ప్రజల విరాళంకూడ ఎప్పుడూ ఉండితీరాలి. అయితే ఆ మేచ్ గ్రాంట్‌లో తరతమాల తేడాలున్నాయి. బాగా ఎడ్వాన్స్‌డ్ ఏరియాలో సగం అడగటం న్యాయమేగాని, బాగా బేక్ వర్డుగాఉన్న ఏరియాలో "నామినల్‌గా కొంత మేము ఇచ్చాము; మేముకూడ భాగస్వాములుగా ఉన్నాము" అని అనుకొనే అవకాశం వారికి ఇవ్వకపోతే లాభంలేదని చెబుతున్నాను.

స్టాఫ్‌లో తలబిరుసుతనం చాలా ఉంటున్నది. విలేజ్ లెవెల్ వర్కర్సు మాత్రం చాలా నిజాయితీగా పనిచేస్తున్నారని నా అభిప్రాయం. వారికి మనం ఎంకరేజ్‌మెంట్ ఇవ్వాలి. వారి కష్టాలను మనం సానుభూతితో చూసి, వారి పరిస్థితి బాగుచేయవలసిఉన్నది. అయితే దీంట్లోకూడ స్త్రీలు ఉన్నారు. వారు గొప్ప త్యాగంచేసి వస్తున్నారన్నది మనం ఆలోచించకపోతే, మనం వెల్‌ఫేర్ స్టేట్ నిర్మించలేము. మనం వారిని చాలా సానుభూతితో చూడాలి. అక్కడ ఉన్న వర్కర్సు అక్కడ ఉన్న ప్రతినిధులు "ఏదైనా చిక్కువస్తే మనం వెళ్ళి వాళ్ళందరిని బ్రతిమలాడి, ఉన్నటువంటి సమాజంలో సగంగా ఉన్నవారిని నీవు అభివృద్ధిచేయకుండా ఎంతకాలం ఉంటావు ? మగవాడుపోతే ఆడవాళ్లు వినరు,

అందువల్ల ఆడవాళ్ళకు అభివృద్ధి కావాలన్నట్లయితే, వీళ్ళు అక్కడ ఉండి పని చేయగలిగినపుడే సాధ్యం అవుతుంది" అనేమాట చెప్పాలి. ఈ విషయంలో మెహతా కమిటీ టీమ్‌లో ఉన్న "రావు" గారితో నేను ఏకీభవించటంలేదు. స్త్రీ విద్యాప్రచారకులను వారు తీసివేయమన్నారు. నేను మాత్రం అది అంగీకరించటంలేదు. నేను స్త్రీలు ఉండాలని గట్టిగా చెబుతున్నాను. ఆ స్కీమ్సు వేసేటప్పుడు ఏమి చిక్కు వస్తున్నదంటే, ఏప్రియల్ ఒకటవ తారీఖునుంచి ప్రారంభించామని (లెక్కకు) చెబుతున్నారు వారికి ఆర్డర్స్ జూన్‌లోనో, ఆగస్టులోనో వస్తున్నవి. అప్పటికి ప్రారంభించినట్లు లెక్క కడతారు. అప్పటినుండి మూడు నెలలలో స్కీమంతా వర్క్ చేయాలి. వర్క్ చేసేటటువంటి స్కీముకు సర్వే పూర్తికావాలి. సర్వే వెంటనే పూర్తికాకపోతే ఆఫీసర్సు అంతా నెత్తిన కూర్చుంటారు. ఆ వెళ్ళి నటువంటి విలేజ్ లెవెల్ వర్కర్స్ ఏ అనుభవంతో చెపుతున్నారు? ఆతడు సర్వే పూర్తిచేయటానికి టయిమ్ పడుతోంది. ఆ టయిమ్‌కు అవకాశం నిర్వహించేటప్పటికి, (తరువాత చేసేటటువంటి భవిష్యత్ కార్యక్రమమంతా ఆ సర్వే మీదనే ఆధారపడుతోంది గనుక) ఆ సర్వే ఎప్పుడైతే సరిగాలేదో, మొత్తం కార్యక్రమమంతా విఫలం కావటానికి అవకాశం ఏర్పడుతుంది. అందువల్ల (ఇన్‌టెన్‌సివ్ అండ్ ఎక్స్‌టెన్సివ్) లోతుగాను, విస్తృతంగాను జరపటానికి ఎక్స్‌పర్ట్సును వేయటం అవసరమని చెబుతున్నాను.

లోకల్ డెవలెప్‌మెంట్ వర్క్సు ఉన్నవి. లోకల్ డెవలెప్‌మెంట్ వర్క్సు ఆఖరు నిముషంలో తీసుకొచ్చి ఇస్తున్నారు. ఉదాహరణకు చెబుతాను. లోకల్ డెవలెప్‌మెంట్ వర్క్సు ఫిబ్రవరిలో వస్తున్నవి. దానికి బిల్డింగులు కట్టేందుకు గవర్నమెంటు సహకారం లేదు. డిపార్టుమెంటు సహకారంలేదు, ఒక డిపార్ట్‌మెంట్‌కు ఒక డిపార్ట్‌మెంట్ పూర్తిగా నాన్ కో-ఆపరేట్ చేస్తున్నాయంటే యథార్థం అవుతుందని చెబుతున్నాను. ఇనుము కావాలి. సిమెంటు కావాలి. ఇంజనీర్సు కావాలి. ఎస్టిమేట్స్ కావాలి. ఇవి ఏవీ రావు. "మీరు చేస్తారా, లేదా" అని బాధ్యత ప్రజల నెత్తిన వేస్తున్నారేగాని, ఆ బాధ్యత ప్రభుత్వం కూడా వహించి "దీంట్లో వచ్చిన లోపం మాది" అని అనుకొని చేయకపోతే లాభం లేదు.

మన రాష్ట్రంలో జరుగుతున్న గొప్ప పనులలో లోకల్ డెవలెప్‌మెంట్ వర్క్సు చాలా గొప్పవి. ఈ విషయం చెప్పటానికి నేను గర్విస్తున్నాను. ఇండియా మొత్తంమీద ఆంధ్ర దేశంలో ఉన్న బ్లాక్స్ చాలా అభివృద్ధిగా ఉన్నాయని ఇతరులు చెప్పినప్పుడు నేను గర్విస్తున్నాను కాని, మనలో మన మాటగా చెప్పుకోదలచుకొంటే, నిజంగా మనం ఇంత అన్యాయంగా ఉన్నామే తక్కినవారు ఇంకెంత అన్యాయంగా ఉన్నారో, అన్న అభిప్రాయం కూడ

వస్తోంది. అయితే మనవాళ్ళందరినికూడ త్రోసిపారవేయటానికి కాదు. నేను చెబుతున్నది. మీరు చేస్తున్నది బాగానే ఉంది. కాని ఇంకా ఎక్కువ చేయాలి. కాబట్టి ప్రజాప్రతినిధులుగా ఉన్నవారంగరు దీనిని జాతీయ బాధ్యతగా, దేశ భక్తి బాధ్యతగా నిర్వహించాల్సి ఉన్నది. ఈ బ్లాక్స్ నిర్వహించటంలో చాలా కష్టాలు ఉన్నాయన్నది జ్ఞాపకం ఉంచుకోవాలి. ప్రజాప్రతినిధులుగా మనం ఆ కష్టాలన్నీ పడవలసి ఉన్నది. కాని ఆఫీసర్స్ పడుతున్నారు. కాబట్టి మన మందరం సహకరించి దీనిని నడపాలని చెబుతున్నాను. ఈ లోపాలను దిద్దేం దుకు మనం పూర్తిగా ప్రయత్నం చేయకపోతే ప్రభుత్వం చేస్తున్న కార్య క్రమం విఫలం అవుతుందని హెచ్చరిస్తూ, నాకు ఈ అవకాశం ఇచ్చిన అధ్య క్షులకు నా ధన్యవాదాలు అర్పిస్తూ ముగిస్తున్నాను.

*శ్రీ బి. పి. శేషారెడ్డి: అధ్యక్షా, ప్లానింగుక్రింద ప్రభుత్వమువారు గ్రామాలలో రోడ్లకుగాను ఖర్చుచేసే సొమ్ము అంతాకూడ వృథాగా వ్యయం అగుచున్నదనే విషయము నేను ప్రభుత్వము దృష్టికి తెస్తున్నాను. ఒకసారి రోడ్లు వేసినతరువాత అవి ఒక్క సంవత్సరమువరకే ఉపయోగపడుతున్నవి. మరు సంవత్సరము వచ్చేసరికి ఆ రోడ్లు అన్నీ చెడిపోయి బండ్లుగాని, మోటార్లు కాని పోవటానికి వీలులేకుండా వుంటున్నవి. వాటికి అప్పుడప్పుడు అవసరమైన మరమ్మతులు చేయడమే దీనికి కారణము. అందువల్ల యివి వర్షాకాలమువచ్చే టప్పటికి గుంటలుపడి చెడిపోవడము జరుగుచున్నది. మంత్రిగారు ఈ విషయ ములో కొంత శ్రద్ధవహించాల్సిందిగా కోరుతున్నాను. శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్యగారు చెప్పినట్లుగా Local Development Works క్రింద కొన్ని works చేయిస్తున్నారు. ఈ works చేయటానికి సంవత్సరము మొదటినుంచి డబ్బు ఖర్చుపెడుతూ చేయిస్తూపోతే బాగా ఉండేది. అలా చేయకుండా, సంవత్సరము అంతా ఊరుకుని సంవత్సరము పూర్తి అయ్యేటప్పుడు అనగా జనవరి ఆఖరులో ఫిబ్రవరి మాసము ఆఖరులో ఈ works ను ఆరంభిస్తున్నారు. మరల ఈ works క్రింద allot చేసిన సొమ్ము అంతా మార్చి 31 వ తేదీ లోపల ఖర్చు చేయవలసివుంటుంది గనుక, హడావిడిగా, ఎక్కడినుంచో పచ్చికర్రలు తెచ్చి, అవి ఎండకుండానే అప్పటికప్పుడు వంతెనల కట్టడములకు ఉపయోగించి కట్టుతున్నారు. కొద్ది రోజులు అయ్యేటప్పటికి ఆ కర్రలు వంగి పోయి, వంతెనలు, కట్టడములు పడిపోవడము జరుగుతున్నది. అవి మరల కట్టించవలసివస్తున్నది. అందువల్ల ఆ కట్టడములమీద పెట్టిన డబ్బు అంతా వృథాయేనని చెప్పవలసివస్తున్నది.

తరువాత N. E. S. Blocks ను గురించి ఒక్క విషయము చెప్పదలచు కున్నాను. కొన్ని తాలూకాలలో ఈ బ్లాకులను ఏర్పాటు చేయలేదు. ఉదాహ రణకు మా ద్రోణాచలం తాలూకాలో యింతవరకు ఒక్క బ్లాకుగూడ ఇవ్వ

లేదు. కొన్ని తాలూకాలలో 3 బ్లాకులు, 4 బ్లాకులుకూడా యిచ్చారు. ఈ విధంగ ఎందువల్ల ప్రభుత్వము చేస్తున్నదో అర్థముకాలేదు. కాబట్టి ప్లానింగు మంత్రిగారు కొంతవరకు ఈ విషయము పరిశీలించి, ఏ ఏ తాలూకాలలో అయితే, ఈ బ్లాకులు యివ్వలేదో, ఆ యా తాలూకాలలోగూడ అవసరమును బట్టి, అవసరమైనన్ని బ్లాకులు వెంటనే ఏర్పాటుచేయమని కోరుతున్నాను.

శ్రీ పి. వి. నరసింహారావు (మంథాని) : అధ్యక్షా, ప్లానింగుమంత్రిగారు ఈనాడు ప్రతిపాదించిన డిమాండును నేను సంపూర్ణముగ బలపరుస్తున్నాను. ఈ డిమాండు క్రింద ఈ సంవత్సరమునకు కేటాయించిన ధనమును చూచారు. గత సంవత్సరం కేటాయించిన ధనమును పూర్తిగా వినియోగించినట్లు తెలుస్తున్నది. ఇంతవరకు గత సంవత్సరంలో ప్లానింగుక్రింద జరిపిన కార్యక్రమములు అన్నీ పరిశీలించి చూస్తే, అవి ఎంతో విజయవంతముగను, తృప్తికరముగను ఉన్నవి. అందువల్ల నేను ప్లానింగు మంత్రిగారిని ప్రత్యేకంగా అభినందిస్తున్నాను. ఐతే ఈ విషయంలో కొందరికి అభిప్రాయభేదములు ఉండవచ్చు. మనకు ఎంతవరకైతే ఈ ప్లానింగు కార్యక్రమ నిర్వహణలో ప్రజాసహకారము ఉండదో అంతవరకు ఈ కార్యక్రమములు మనము అనుకున్నప్రకారం సంతృప్తికరముగ జరుగవని మాత్రం అందరు గుర్తించవలసినవిషయమే. కాబట్టి ఈ కార్యక్రమములకొరకు ఇతోధికముగ ప్రజాసహకారం సంపాదించాలంటే, మనము ప్రజలను ప్రోత్సహించాలి. ఈ కార్యక్రమము నెరవేర్చుకోటానికి ప్రయత్నించాలి. ఈ కార్యక్రమములపట్ల సూచనలుయిచ్చేముందు ఒక్క విషయం మనవిచేస్తాను. ఆంధ్ర ప్రదేశ్‌లో Agency ప్రాంతాలలో అడవిజాతులవారు అక్కడక్కడ ఆరేసి గుడిసెలు, ఏడేసి గుడిసెలు, పదేసి గుడిసెలు చొప్పున కట్టుకుని నివసిస్తున్నారు. అవే వారికి గ్రామాలుగా ఉంటున్నవి. ఈ గుడిశలు కూడ అయిదారు మైళ్ళ దూరములో ఉంటున్నవి. ఒక్కొక్కచోట 30,40 మంది కంటె లేరు. ఆ అడవులలో వీరియొక్క పరిస్థితి కనుక్కునేవారులేరు. వీళ్ళ జీవితము చాలా అధ్వాన్నముగా ఉంటున్నదన్నసంగతి ఎవ్వరు కాదనలేరు. ప్రభుత్వమువారు 66 వేల జనాభాకు ఒక్కొక్క N. E. S. Block ను ఏర్పాటు చేస్తున్నారు. ఈ బ్లాకు క్రింద సాధారణముగ ఏ 260 గ్రామాలో ఉంటాయి, ఈ బ్లాకులో ఒక్కొక్క గ్రామంలో మంచినీరు బావి అయినా యివ్వాలి అనుకుంటే, ఈ బావులక్రిందనే బ్లాకు మొత్తమునకు 6,7 లక్షలు ఖర్చుచేయవలసి ఉంటుంది. అదికూడ చాలవు అని లెక్కలవల్ల తేలుతున్నది. ఒక్కొక్క బ్లాకులో ఈ 66 వేల జనాభా అంతాకూడ ఏ 40,50,60 గ్రామాలలోనో ఉంటుంది. ఈ ఏజన్సీ ప్రాంతాలలో 150 నుంచి 200 గ్రామాలలో ఉంటుంది. ఇన్ని గ్రామాలకు ఒక్క బ్లాకుగా ఏర్పాటు చేయడమువలన సౌకర్యాలు కలుగచేయటానికి వీలుండదుగనుక ఈ విధానము మార్చితే మంచిదని నా అభి

ప్రాయము. విస్తీర్ణము లెక్కకు తీసుకుంటే ఒక్కొక్క బ్లాకుకు 200,300 sq. miles కంటె మించి వుండదు. కాని ఏజన్సీ ప్రాంతాలలో 500 నుంచి 800 చ॥ మైళ్ళదాకా ఉంటున్నది. ఈ Agency ప్రాంతాలు ఆంధ్ర ప్రాంతములోవలె తెలంగాణా ప్రాంతములోకూడ ఉన్నవి. మనకు వీలు అయినన్ని multi purpose projects కూడ తెచ్చుకోవలసిన అవసర మున్నది. ఇవి తెచ్చుకునే స్థితిలో రాష్ట్ర ప్రభుత్వము లేదు. వీటికొరకు మనము కేంద్ర ప్రభుత్వమువద్దకే పోవలసిఉన్నది. కేంద్ర పభుత్వాన్ని అడిగితే, వారు ఇస్తారో యివ్వరో అనే అనుమానము నాకు కలుగుతున్నది. Multi - Purpose Projects వస్తాయోరావో అని అనుమానము ఉంటున్నప్పుడు కనీసము ఈ N. E S. Blocks ను ఎక్కువ చేసుకోటానికైనా ప్రయత్నించ వలసి ఉంటుందని మనవి చేస్తున్నాను. ఒకవేళ అదికూడ సాధ్యపడకపోతే, మన ఆంధ్ర ప్రదేశ్‌కు యిచ్చిన 447 blocks ను delimitation పద్ధతిననుసరించి మార్పు చేసుకొని, 66 వేల జనాభాకు బదులు 30 వేల జనాభాకు ఒక్కొక్క బ్లాకు క్రింద ఏర్పాటు చేసుకుంటే, ఒక్కొక్కదానికి 400 మైళ్ళ విస్తీర్ణము ఏర్పడుతుంది. ఈవిధముగ చేస్తే ఇవి rational గా ఏర్పాటు చేసుకున్నవార మవుతాము. లేకపోతే యిప్పుడు ఈ బ్లాకులు మనకు యిచ్చినను వీటివల్ల ఉపయోగములేదు గనుక, ఇవి ఇవ్వనట్లేనని భావించవచ్చు. కాబట్టి ప్లానింగు మంత్రిగారు ఈ విషయమును గురించి తీవ్రంగా ఆలోచించి ఈ blocks కు delimitation చేయమని కోరుతున్నాను. ఈవిధముగ చేయకపోతే, రాష్ట్రములు ఉంటున్న ప్రస్తుత పరిస్థితులలో మనము ఈ బ్లాకులను నిర్విఘ్నముగా ముందుకు తీసుకుని పోలేమని నా అభిప్రాయము. ప్రజా సహకారమును గురించి కొన్ని సూచనలు చేయదలచుకున్నాను. ఇదివరకు ఒకటి, రెండు కేసులు నేను మంత్రిగారి దృష్టికిగూడ తెచ్చియున్నాను. ప్రతిగ్రామములోను Local Development Works ను ఏర్పాటు చేసే సందర్భములో ప్రజల తరఫున యివ్వవలసిన సొమ్మును Cash deposit గా యివ్వమని అధికార్లు కోరుతున్నట్లు తెలుస్తున్నది. Cash deposit కట్టకపోతే, మేము ఈ కార్యక్రమము ముందుకు తీసుకుని పోముఅని కలెక్టరు ఖచ్చితముగ చెబుతున్నారట. నేను మంత్రిగారి దృష్టికి తెచ్చిన ఒకటి, రెండు కేసులలో మంత్రిగారువచ్చి కలెక్టరుకు instructions ఇచ్చినందువల్లనే, ఆ రెంటిలోను కార్యక్రమములు అయినా సాగించారు. తరువాత మంత్రిగారు యివతలకు రాగానే, ఆ రెండు విషయములోతప్ప, మరల cash deposits కోరేటటువంటి పాతపద్ధతినే అధికార్లు అవలంబిస్తున్నారు. ప్రజా సహకారముమీద insist చేస్తే మనకు అది రాదు. ఇది వారిని ప్రోత్సహించడంద్వారానే లభించగలదు. ఇది నా అనుభవము. అధికార్ల అధికారము, దౌర్జన్యము, దర్జా, దర్పము ప్రజలమీదచూపిస్తే, యిలాంటి సహకారము అందదు.

రిజానికి నా అభిప్రాయము చెప్పమంటేడబ్బుఉన్న ప్రాంతాములో ఈ బ్లాకులు అవసరమేలేదు. డబ్బులేనటువంటి ప్రాంతాలు కరువుతోను, మంచినీరు, రోడ్లు సౌకర్యాలు లేనటువంటి ప్రాంతాలలో ముందు, ఈ సొమ్ము అంతా ప్రజా సౌకర్యము అవసరము లేకుండానే చేయిస్తే ప్రజలు సంతోషిస్తారు. డబ్బుగల వారి వద్దకు పోయి—వారంతటవారు ముందుకువచ్చి సహాయపడితే తప్ప—వారిని కోరడము అవ్యక్తము. డబ్బు లేనటువంటి చోట్ల, పేదప్రజలు నివసించే చోట్లలో ప్రభుత్వము ఈ works ను take up చేస్తే అక్కడ ప్రజలు తప్పకుండా శ్రమదానము అయినా చేయటానికి ముందుకు వస్తారు. వారంతట వారు voluntary contribution ఇస్తే, ఈ works take up చేసి నిర్వహించవచ్చు. ఈ works ముఖ్యంగా ప్రజలయొక్క శ్రమదానము మీదనే ఆధారపడి ఉంటాయి. డబ్బు లేనటువంటి రోజులలో డబ్బు యివ్వమని అంటే, ఏ ఒక్కరు కూడ ఇష్టపడరు. ఇలాంటి పరిస్థితి ఉన్నచోట వారిని approach చేయడము శుద్ధ తెలివితక్కువనే అనగలను. తరువాత గ్రామాలలో ఉండే ప్రతినిధుల యొక్క ప్రోత్సాహము వల్లనే, గ్రామాలలోని ప్రజానీకము యొక్క సహాయము లభించగలదు. కాని ఈనాటి పరిస్థితులను బట్టి గ్రామ ప్రతినిధుల యొక్క పరిస్థితే చాలా అధ్వాన్నముగ ఉన్నది. అలాంటప్పుడు వారియొక్క ప్రోత్సాహము ఏ విధముగా మనకు ఉపయోగపడగలదు ? వారు ధనవంతులు కూడ కారు. వారికి గూడ ఎన్నో క్లిష్టపరిస్థితులు ఉంటూఉంటాయి. వారు విద్యావంతులు కారు. అధికార్లు గ్రామాలకు వెళ్ళితే, వారిని సంతోషపెట్టేటంతటిసామర్థ్యము వారికి లేకపోవచ్చు. అందువల్ల Village Representatives కు అధికారపూర్వకముగా గ్రామాలలో ప్రజల సహకారము లభింపజేయలేరు. ఈ విషయములో నేను కొన్ని సూచనలు చేయదలచుకున్నాను. వీటిని నేను యిదివరలో జరిగిన Seminors లో చెప్పియున్నాను. మంత్రిగారు, డిపార్టుమెంటులోని అధికార్లనందరినీ ఒకసారి సమావేశము జరిపేటట్లయితే, నేను సూచనలు చేయటానికి సిద్ధముగా ఉన్నాను.

Block Councils ఏర్పాటు చేస్తామంటున్నారు. ఇదివరకు Block Councils లో అధికారులే అధ్యక్షులుగా ఉండేవారు. ఇప్పుడు అధికారేతరులు రాబోతున్నారని సంతోషించినంత మాత్రాన లాభంలేదు. అధికారేతరులు ఎటువంటివారు వస్తారో, వారు చేయవలసిన విధుల గురించి వారికి ఎంతవరకు తెలుస్తుందో, ఎంతవరకు అర్థం చేసుకోగలరో మనం చెప్పలేము. కాబట్టి బ్లాకు కౌన్సిల్సులోకి వచ్చే non-officials కు training ఇవ్వడం జరుగకపోతే, ఈ కౌన్సిళ్ళవల్ల బహుశా, నష్టమే సంభవిస్తుందని నేను భయపడుతున్నాను. ఈ విషయాన్ని బాగా పరిశీలన చేయాలని మంత్రిగారికి మనవి చేస్తున్నాను. ఇంకొక ముఖ్యమైన విషయంచెప్పి ముగిస్తాను. ఇప్పుడు మనంజరిపే నిర్మాణ

కార్యక్రమాలలో అన్నిటికంటె పెద్ద అడ్డంకి financial year మార్చి 31 వ తేదీతో ముగిసిపోవడమే. మళ్లా April 1 st నుంచి కొత్త financial year ప్రారంభమవడం జరుగుతున్నది. ఆట మంచిరక్తికట్టిన సమయంలో మద్దెల తీసేసి నట్లుగా ఉంటున్నది. సాధారణంగా మార్చి నెలలోనే నిర్మాణ కార్యక్రమాలు బాగా జరుగుతుంటాయి. పని చురుకుగా సాగుతూంటుంది. అటువంటి సమయం లోనే డబ్బు lapse అయిపోతుంది. మళ్ళా రెండు, మూడు నెలలవరకూ, — sanction అయ్యే వరకు—డబ్బు ఉండదు. ఇటువంటి పరిస్థితులే ఉంటే పని సరిగా జరగదు—ఇందువల్ల 6 మాసాలలో పూర్తి అయిపోయే పని 2 సం.లు అయిపోయినా కూడా అట్లానే ఉండిపోతున్నది. కాబట్టి నిర్మాణ కార్యక్రమా లకు సంబంధించిన — P. W. D. కాని, Irrigation Department గాని, Planning Department గాని — వీటికి financial year జూలై మొదటి తేదీ నుంచి జూన్ 30 వ తేదీ వరకూ ఉండేటట్లు చూసే అవకాశం ఉంటే, ముఖ్య మంత్రిగారూ, ప్లానింగ్ శాఖా మంత్రిగారూ కలిసి ఆలోచించి తప్పకుండా చేయాలని కోరుతున్నాను. చేయవలసిన అవసరం ఎంతైనా ఉన్నదని మనవి చేస్తున్నాను. ఈ సూచన గురించి మంత్రిగారు తప్పక ఆలోచిస్తారని తలుస్తూ అధ్యక్షులకు నా ధన్యవాదాలర్పిస్తూ, ముగిస్తున్నాను.

శ్రీమతి ఎ. కమలాదేవి (ఆలేరు): అధ్యక్షా, ప్లానింగు మంత్రిగారు ప్రవేశపెట్టిన డిమాండుపై ప్లానుకు సంబంధించినంతవరకూ, ప్లాను ఉద్దేశాలకు సంబంధించినంతవరకూ ఎవ్వరికీ అభిప్రాయభేదాలు లేవు. కాని ఆ plan వలన మనధ్యేయం ఎంతవరకూ పూర్తి కాగలదో ఆలోచించుకోవలసియున్నది. మంత్రిగారు డిమాండును ప్రవేశపెట్టినప్పుడు ఈ 5 సంవత్సరాలలో ఎంతడబ్బు ఖర్చుచేసినామో, యికముందు ఎంతఖర్చు పెట్టాలో, ఎన్ని సంవత్సరాలలో మనధ్యేయం పూర్తి అవుతుందోకూడా చెప్పారు. కాని, ఈ 5 సం. లలోనూ ఖర్చుచేసిన దానివల్ల మనం ఏమి సాధించినామో, ఎన్ని స్కూలు బిల్డింగులు కట్టినామో, ఎంతభూమిని వ్యవసాయయోగ్యంచేసి, సాగులోనికి తెచ్చినామో, ఎంతవరకు వ్యవసాయోత్పత్తి పెరిగినదో ఈ లెక్కలేమీ చెప్పలేదు. చెరువుల మరమ్మతు, మైనరు యిరిగేషను పనులు ఈ బ్లాకు డెవలప్‌మెంటు ఆధ్వర్యం క్రింద ఉంటాయి. కాని ఆ లెక్కలేమీ చూపించడం జరుగలేదు. ఈ 5 సం. ల లోనూ ఈ ప్లానువల్ల ప్రజలకు ఏమీలాభంకలుగలేదని, ఈ ప్లాను అసలు ప్రజల దాకా వెళ్ళలేదని నా ఉద్దేశం, మా తాలూకాలో ఒకబ్లాకు ఉన్నది. అక్కడ ఏమీపనులు జరుగుటలేదు. దానినిబట్టి అన్ని ప్రాంతాలలోనూ అదేవిధంగా ఉన్నాయని నేను భావిస్తున్నాను. N. E. S. Blocks లో డబ్బు ఖర్చుచేసే విషయంలో వారికీ యితర డిపార్టుమెంటులవారికీ ఎంత co-operation ఉంటుందో చూడాలి. వీరిమధ్య సహకారభావం లేకపోవడంవలన పనులు

**delay** అవుతున్నాయి. **Planning Department** వారు గ్రామపరపతిసంఘాలను స్థాపించడంకూడా జరుగుతున్నది. వాటిద్వారా వచ్చేడబ్బు విషయంలో గాని, సంఘాలస్థాపన విషయంలోగాని, డిపార్టుమెంటులలో ఒకరికీ, మరొకరికి ఐక్యత లేకపోవడంవలన పనులలో చాలా ఆలస్యాలు జరుగుతున్నాయి. ఉదాహరణకు **Agriculture, P. W. D** ఉన్నాయి. ఈ ప్లానుక్రింద శాంక్షన్ అయిన చెరువుల మరమ్మతు విషయంలో **P. W. D.** కి వెళ్ళాలి. వారు సంవత్సరం ఆఖరివరకూ శాంక్షను చేయకపోవడంవలన వారిచుట్టూ తిరగడం, పైరవి చేయడంలోనే **time** అంతా **waste** కావడం జరుగుతున్నది. కాబట్టి **departments** మధ్యన ఐక్యతను పెంపొందించడం అవసరమని నా ఉద్దేశం. ప్రతి **N. E. S Block** క్రింద ప్రతి సంవత్సరమూ యింతడబ్బు ఖర్చుచేయాలని నిర్ణయించబడుతుంది. నర్సింహరావుగారు చెప్పినట్లుగ ఆ **area** చాలా **lenthy**గా ఉంటుంది. ఒకబ్లాకులో సాధారణంగా 60 గ్రామాలున్నాయనుకోండి. ఆ 60 గ్రామాలలో ఎన్ని గ్రామాలకు మనం కేటాయించిన డబ్బు సరిపోతుందనే విషయము ఆలోచించాలి. ఒక్కొక్కసంవత్సరం ఒక్కొక్క గ్రామానికి యింతధనం ఖర్చుచేసి పనులుచేయిస్తున్నాము అనే విధంగా ఉండాలి కాని ఆ విధంగా జరగడంలేదు. అభివృద్ధి చెందినవారికే **community halls** కట్టడం, **Radio sets** ఇవ్వడం జరుగుతున్నదే కాని ప్రజలకున్న ఆర్థిక ఇబ్బందులను దూరంచేయడానికి, వెనుకబడ్డవారిని ముందుకు తెచ్చేందుకు పాటుపడడానికి ఈ డబ్బు ఖర్చు కాబడుటలేదు. ఇక ముందైనా ఇట్లా జరుగకుండాచేయాలి. బ్లాకు ఏరియాలోని కొన్ని ప్రాంతాలలో పరపతి సంఘాలు ఉన్నాయి. మా తాలూకాకు ఒక బ్లాకు ఏర్పాటుచేసి రెండు సంవత్సరాలు అయినది. అప్పుడు కొన్ని గ్రామాలలో పరపతి సంఘాలు పెట్టారు. అటువంటి వాటికి రు. లు 50,000 వరకు **distribute** చేయడం జరుగుతోంది. అది బాగానే ఉన్నది. కాని ఆ పరపతి సంఘాలలోనికి ఒక **paid Secretary** ని పంపించవలసిన బాధ్యత ప్రభుత్వానికి ఉన్నది. **Paid Secretary** యే కాకుండా, **establishment charges** క్రింద రు. లు 1000 కూడా ఇవ్వాలి. అది కో-ఆపరేటివ్ డిపార్టుమెంటుకు సంబంధించినదైనప్పటికీ **N. E. S. Blocks area** లో స్థాపించబడినది కాబట్టి ఆబాధ్యత **Planning Minister** గారికి ఉండాలి. రెండుసంవత్సరాలక్రితం సాయిగూడెం, ఏకుదూరు, బీబీనగరం, ఈ మూడు గ్రామాలలోనూ పరపతి సంఘాల స్థాపన జరిగినది. కాని **Secretary** గారిని నియమించడం జరుగలేదు. **Establishment charges** కూడా ఇవ్వలేదు. బ్యాంకులను స్థాపనచేయడంలోగాని, స్థాపించిన తరువాత ప్రభుత్వంచేసిన వాగ్దానాలను నెరవేర్చకపోవడంవల్లగాని ప్రజలలో నిరుత్సాహం కలుగుతోంది. **Paid Secretary** లేకపోవడంవలన, బ్యాంకులు **distribute** చేసే డబ్బులో కొంత **percentage** ని అధిక సౌకర్యాలున్నవారే తీసుకోవడం

జరుగుతున్నది. దానివలన ప్రజలలో అసంతృప్తి పెరిగిపోతున్నది. ఈ విధానం వలన ఏమీ లాభంలేదు. ఇందులోకూడా కొంతధనం పంపకాలు చేసుకుంటున్నారే అని ప్రజలలో నిరుత్సాహం కలుగుతోంది. మనం అట్లా జరుగకుండా చేయాలి మన పంచవర్ష ప్రణాళికలో పెద్దపెద్ద ప్రాజెక్టులున్నాయి, **Block Committees** ఏర్పాటుచేశాము, అని చెప్పినంత మాత్రాన ప్రజలు సంతోషపడరు. నందికొండ ప్రాజెక్టు ఉన్నదంటే అది అక్కడి ప్రజలకు మాత్రమే ఉపయోగపడుతుంది. పంచవర్ష ప్రణాళికలవల్ల ప్రతి చిన్న గ్రామంలోనూ ఏమి పనులు జరిగాయి అనేరీతిగా ప్రజలు ఆలోచిస్తున్నారు. **Blocks** కు యిచ్చిన డబ్బు ప్రతి గ్రామంలోనూ **distribute** చేయాలని నేను చెప్పినాను. మా తాలూకాలో ప్లానింగు సెమినార్ జరిగిన సందర్భంలోకూడ నేను యిదే విషయాన్ని చెప్పినాను. అక్కడ అనేక అవకతవకలు జరుగుతున్నాయని చెబుతున్నాను. మా తాలూకాలో ప్లానింగ్ సెమినార్ జరిగినప్పుడు కొన్ని సూచనలు చేసినాను. నరసింహారావుగారు, ఎ. వి. రామారెడ్డిగారూ వచ్చారు. వారు నేను చేసిన సూచనలను మాకే అప్పజెప్పిపోయారు. మంత్రిగారు కూడా ఆ విధంగా చేయక, నేను ఈ విషయాన్ని **flour of the House** లో చెబుతున్నాను. కాబట్టి, మాకు కూడా **representation** యివ్వాలి. మా తాలూకాలో అనేక అవకతవకలు జరుగుతున్నాయి. "అక్కడ **Advisory Committees** ఉన్నాయి. అవకతవకలు జరిగినా వారే బాధ్యులు" అని మంత్రిగారు తమ ఉపన్యాసంలో చెప్పారు. నేను ఆ తాలూకా ఎడ్వయిజరీ కమిటీలో సభ్యురాలను కాదు. నన్ను మెంబరుగా తీసుకోలేదు. అక్కడ ప్రతిపక్షం వైపునుంచి నారాయణరెడ్డిగారు ఒకేఒక **M.L.A.** ఉన్నారు. అందులోని సభ్యులందరూ కాంగ్రెసువారే. అక్కడ జరిగే పనివల్ల వారికైనా తృప్తిఉన్నదా అని ఆలోచిస్తే వారికి కూడా తృప్తిలేదు. వారినుంచి ఒక దరఖాస్తు ఈ పాటికి మంత్రిగారికి అందేఉంటుందనుకొంటున్నాను. లేకపోతే ఈ సాయంకాలానికి అందుతుంది.

**Advisory Committee** సమావేశాలు కావడం జరుగుతోంది. కాని ఎప్పుడూకూడ కోరం ఉండదు. సమావేశాలుజరిగినప్పుడు ప్రతినిధులు రావడం, లెక్కలు చూపమని అడిగితే **B. D. O.** గారు చూపకపోవడం జరుగుతోంది. **B. D. O.** గారు వారి యిష్టానుసారం— **Department** లోని **staff** ను **consult** చేయకుండా పనులు చేస్తూఉంటారు. ఏ ప్లానుకు ఎంత ఖర్చుచేశారో, ఎట్లా ఖర్చుచేశారో చూపించమని అడిగితే 'మేము చూపించము, మా ఇష్టం వచ్చినట్లు ఖర్చుచేశాము' అని కాంగ్రెసు ప్రెశిడెంటుగారికే ఖచ్చితంగా చెప్పారు. మంత్రిగారు కావాలంటే వారినే అడిగి తెలుసుకోవచ్చు. అందువల్ల ఆ కమిటీ నిరుత్సాహంగానే నడుస్తున్నది. ఒక్క సమావేశానికి **quorum** లేక

పోవడమే జరుగుతున్నది. ఈ సంవత్సరంలో quorum ఉన్న సమావేశాలు ఎన్ని జరిగినాయో తెలుసుకుంటే మంత్రిగారికే పరిస్థితి అంతా బోధపడుతుంది.

ఇక లంచాల విషయం చెబుతాను. Advisory Committee లలో సలహాలు ఇచ్చే staff ఉన్నది. కాని ఆ staff యొక్క సలహాలు తీసుకోవడంలేదు. వారి సమావేశాలు లేవు. ఫలానాచోట ఫలానాపని చేయాలి అనిచెబితే, "నీకు, ఏమీ తెలియదు; ఆపని సంగతి నీకు అవసరం లేదు," అంటారు.

శ్రీ వి. బి. రాజు : అది ఏ బ్లాకులో జరిగింది ?

శ్రీమతి ఎ. కమలాదేవి : భువనగిరిలో జరుగుతున్నది. అక్కడ ఇంకా కొన్ని అవకతవకలున్నాయి. కాని Audit Commtitee లెక్కలు సరిగానే ఉన్నాయని చెప్పవచ్చు. అక్కడ approach roads వేస్తున్నారు. ఒకసారి నేను వెళ్ళి చూచినాను. బీబీనగరంలో ఒక approach road వేశారు. ఒక furlong కూడా approach road లేదు. అది ఎవరికి కాంట్రాక్టు యిచ్చారో తెలియదు. ప్రజల contribution లేదు. ప్రజలనుంచి contribution అడిగారు అంటే అది వేరే సమస్య. Approach roads వేసేటప్పుడు అక్కడి ప్రజలు contribution యిస్తామంటే—యివ్వాలా; లేదా అనేదికూడా ఆలోచించాలి. ఆ పనులు చేయాలి — కందుకూరులో ఒక బ్లాకు ఉన్నది. అక్కడి ప్రజలు "మేము contribution యిస్తాము, రోడ్డుకు చాలా దూరంలో ఉంటున్నాము, approach road వేయండి" అని అడిగితే B. D. O. గారు ఒప్పుకోక, వారికి యిష్టం వచ్చినచోట అభివృద్ధిలోఉన్న గ్రామంలోనే approach road వేయించారు. అది అక్కడి ప్రజలకు కూడా ఉపయోగం లేదు. అక్కడ నుండి రోడ్డుకు ఫర్లాంగు కూడా లేదు. ఆ విధమైన పనులే ప్రతిచోటా జరుగుతున్నవి. అనాశపురం చిన్న గ్రామం. అక్కడ ఎలెక్ట్రిసిటి, పైప్ సిస్టం పెట్టినారు. అందుకు నాకేమీ అభ్యంతరంలేదు. ప్రతి చిన్న గ్రామానికి అలాంటి సౌకర్యములు ఉండాలి. కాని అక్కడ కాంట్రిబ్యూషన్ ఎంత వచ్చిందో వేజ్ కమిటీలో చూపించరు. కాంట్రిబ్యూషన్ అనగా నా ఉద్దేశ్యప్రకారం, లేబర్ రూపములో దానిని తీసుకోవాలి. నేనుకూడా అందులో భాగస్వామిని. నేను మంత్రిగారికి represent చేసినాను. వారు అంగీకరించారు. మా దగ్గర కూడా కొన్ని పనులు జరుగుతున్నవి. మార్చి పూర్తి కాబోతున్నది. కాని ఆ పనులు మాత్రం కాలేదు. అక్కడివారు అసంతృప్తితో ఉన్నారు. కాని పని పూర్తి కావడంలేదు. అలా పూర్తి కాకపోవుటకు కారణమేమిటో ఆలోచించాలి. డిపార్టుమెంటు డబ్బును ఖర్చు ఎలా చేయాలో విచారిస్తున్నారే కాని ఏ విధంగా చేస్తే ప్రజలకు ఉపయోగంగా ఉంటుంది ? ఏ విధంగా ఖర్చుచేస్తే ప్రజల ఆర్థిక

పరిస్థితి బాగుపడుతుంది అని ఆలోచించుట లేదు. కొంత డబ్బు జేబులో వేసుకోవడం, ఖర్చు చూపడం జరుగుతున్నది. భువనగిరి బ్లాకులో మీరు enquiry committee ని వేసి విచారించితే అక్కడ పనిచేస్తున్న స్టాఫ్ prove చేస్తుంది. ఈ మధ్య ఆడిట్ కమిటి అక్కడకు వచ్చింది. ఆ కమిటీవారిని సంతృప్తి పరచుటకు స్టాఫ్ దగ్గరనుండి 15 రూ॥ల చొప్పున వసూలు చేసి పెద్ద పెద్ద డిన్నర్ పార్టీలు చేసినారు. వారికి వచ్చే 75 రూ॥లలో 15 రూ॥లు ఇందుకు తీసుకున్నచో వారు జీవితమును ఎలా గడపగలరో మీరే ఆలోచించాలి. వారికీ జీతాలు కూడా మొదటి తారీఖునే ఇవ్వాలని ఉన్నది. కాని 15 వ తేదీ తరువాత కూడా ఇచ్చిన ఉదాహరణలు ఉన్నాయి. ఈ N. E. S. బ్లాకులలో అవకతవకలు జరుగుతున్నవి. ప్రభుత్వం కూడా పక్షపాత వైఖరిని అవలంబిస్తున్నదని చెప్పకతప్పదు. ఆ కమిటీలలో ఒకే పార్టీవారిని నింపుతున్నారు. అందుకు మాకు అభ్యంతరంలేదు. పనులు బాగా జరుగుతూఉంటే, అదే మాకు సంతోషం. ఆ కమిటీలో ఉన్న దానిలో జరుగుతున్న లోపాలు, వారు ఏమిచేస్తున్నదీ బయటపడగలవు.

ఈ సంవత్సరం నల్లగొండ జిల్లాలో నకరకల్, చిన్నకొండూరులకు N. E. S బ్లాక్సు ఇచ్చారు. చిన్నకొండూరు N. E. S బ్లాకు ప్రారంభోత్సవమునకు వి. బి. రాజు గారు వెళ్ళారు. అది కాంగ్రెస్‌వారి ప్రాంతం. చిన్నకొండూరు కిచ్చిన బ్లాకు ఆలేరుకు రావాలని నా ఉద్దేశ్యం. జిల్లా కలెక్టరుకూడా మా ఆలేరుకు రావాలని వ్రాసినట్లు చెప్పినారు. కాని కొండాలక్ష్మణగారు గెల్వగానే అది చిన్నకొండూరుకు మార్చటం జరిగింది. నకరకల్ బ్లాకు ప్రారంభోత్సవానికి వి.బి. రాజుగారు పోలేదు. తర్వాత ఆర్గనైజ్ చేయుసందర్భంలో వెళ్ళారు. నకర్‌కల్‌కు జె. వి. నరసింగరావుగారు వెళ్ళారు. Information Bureau వారి "ఆంధ్రప్రదేశ్" పేపరులో కొండా లక్ష్మన్‌గారి కాన్‌స్టిట్యూయన్సీలో జరిగిన N.E.S బ్లాకు ప్రారంభోత్సవ ఫోటోలు, వివరాలు ఉంటాయి. కాని నకరకల్ ప్రాంతంలో జరిగిన బ్లాకుప్రారంభోత్సవమునకు Information Bureau ఒక్క ఫోటోగ్రాఫరునుకూడా పంపలేదు. ఈ బ్యూరో కేవలం మంత్రుల కొరకు, కాంగ్రెస్ పార్టీకొరకే ఉన్నదా? నకరకల్ ప్రారంభోత్సవమునకు కమ్యూనిస్టుపార్టీ, అక్కడి మెంబరు ప్రోద్బలంవల్ల ఎక్కడా జరుగనట్టి rally అక్కడ జరిగింది. ఆ విషయం జె. వి. నరసింగరావుగారికి తెలుసు. కాని ఈ Information Bureau వారు పేపరులో ఒక advertisement గాని, ఒక ఫోటో గాని వేయలేదు. రేడియోలోకూడ బ్రాడ్‌కాస్ట్ చేయడం జరుగలేదు. ఇక ముందైనా ఇలాంటి అవకతవకలు జరుగకుండా చూడాలి. ఫలానాచోట అపోజిషన్ వారికి బలంఉన్నది; కాబట్టి అక్కడ అభివృద్ధిచేయము అనే తత్వంతో గాక ప్రజలంతా అభివృద్ధికావాలి అనే విశాలదృక్పథమును అలవరచుకోవాలి.

[Sri Apparao Shetkar (Narayankhed)] شری اپا راؤ شیٹھکر (نارائن کھیڑ)

۔ مسٹر اسپیکر سر۔سب سے پہلے مین آپکا شکریہ ادا کرتا ھوں کہ آپ نے بڑے انتظار کے بعد اس حقیر کی جانب اپنی نظر اٹھائی۔ جناب من۔آج ڈولپمنٹ اور پلاننگ پر کچھہ کہنے کا موقعہ ملا ھے۔ شری وی۔ بی۔ راجو صاحب اسکے کرتا دھرتا ھیں۔ مین اپنے کچھہ احساسات ان کے کانون تک پہنچانا چاھتا ھون۔ ڈولپمنٹ اور پلاننگ کا قلمدان وزارت آپکو ملنے کے بعد بہت توقعات تھے۔ میہتا کمیٹی رپورٹ اور دیگر چیزون کے بعد کافی تبدیلیاں ھونگی۔ ڈولپمنٹ بلاکس اور پلاننگ افیسرس کے رویہ میں اور وھاں کے کاموں میں کچھہ تبدیلی ھوگی۔ وھاں کے کام کاج کے طریقہ میں کچھہ تبدیلی آئیگی اسکی توقع کی جا رھی تھی۔ لیکن ھنوز وھان روز اول ھی ھے۔ جناب من۔مین آپکے توسط سے منسٹر صاحب کو توجہہ دلانا چاھتا ھوں یہ بات منسٹر صاحب سے پوشیدہ نہین ھے کہ دیھی رقبہ میں آبادی دن رات بڑھ رھی ھے۔ ممکن ھے معدودئے چند اشخاص کو اولاد نہین ھوتی لیکن دودو۔ چارچار۔ آٹھہ آٹھہ۔ بارہ بارہ۔ چودہ چودہ بچے ایک ایک آدمی کر ھو رھے ھین۔ لوگ پریشان ھین اور بچے بڑھ رھے ھین۔ اور زمین جتنی تھی اتنی ھی ھے۔ بارش کم ھونے کی وجہہ سے زرعی اجناس میں کوئی خاص اضافہ نہین ھوا ھے۔ کپاس میں۔ مونگ پھلی میں۔ اور ارنڈی کی پیداوار میں اضافہ ھوا ھے لیکن زرعی اجناس کی پیداوار میں کوئی اضافہ نہین ھوا ھے۔ آبادی ھے کہ بڑھتی جا رھی ھے۔ لوگ فاقہ کشی میں مبتلا ھین۔ اگر دس بارہ سال یا بیس سال پہلے کے حالات اوراق گردانی کرکے دیکھین تو معلوم ھوتا ھے کہ ھماری معاشی حالت آزادی ملنے کے بعد بہتر نہین ھوئی ھے بلکہ پہلے سے ابتر ھوئی ھے۔ میں آپکو بتلاتا ھوں کہ مین دس‌بیس ایکڑ خشکی رکھنے والا کاشتکار ھون۔ میرے پاس دس سال پہلے اتنا اناج ھوتا تھا کہ سال ختم ھونے کے بعد بھی سلک رھتا تھا۔ لیکن آج وہ حالت نہین ھے۔ پھر بھی اس جانب توجہہ نہین کیجارھی ھے۔ میرے علاقہ ظہیرآباد اور مرزاپور کے تحت ین۔ ای۔ یس بلاک اور کمیونیٹی ڈولپمنٹ بلاک کے تحت جو کام ھوا ھے وہ یہ ھے کہ ایک مدرس کا ایک مدرسہ قائم ھوا ھے۔ ایک مدرسہ میں جہاں بیس بچے پڑھتے ھین وھان پانچ پانچ کمرے بنے ھین۔ اور جہان کمیونیٹی ھال ھے وھان پانچ آدمی بھی نہین بیٹھتے۔ خیر۔ ھماری قومی دولت اسطرح رائگاں ھورھی ھے۔ ظہیرآباد اور مرزاپور تعلقات میں ایک تالاب یا کنٹہ درست نہین ھوا ھے حالانکہ وھان ایک سو ایک کنٹے اور تالاب ھین۔ اس رفتار سے ین۔ ای۔ یس۔ بلاک اور سی۔ ڈی۔ بلاک میں کام ھوتا رھا تو ھماری معاشی پستی اور بھی زیادہ پریشان کن ھو جائیگی۔

آج مجھے چھوٹے ذرائع آبپاشی کے متعلق کچھہ کہنا ھے۔ ننڈی کنٹا بنتا ھے تو ایک اوب روپے سے زیادہ خرچ ھوتے ھین۔ وھان کی رعایا اور عوام

ضرور اس سے فائدہ اٹھاتے ھین لیکن ھمیں کوئی فائدہ نہین ھوا ھے اسیطرح تنگبھدرا بنا ھے تو اس میں بھی ھمارا کوئی فائدہ نہین ھوا ۔ اسکے قطع نظر وھاں جتنی زمین سیراب ھونا چاھئیے تھا وہ نہین ھورھی ھے ۔ اسی طرح کڈم پراجکٹ بنتا ھے ۔ ڈیام مکمل ھوتا ھے لیکن اسکی نہریں نہین بنتین ۔ اس طرح ھماری قومی دولت کو زمیں میں گاڑہ دیتے ھین تو یہ بات ایك ایسے بنئے سے بھی زیادہ بدتر ھے جو اپنا سونا زمین مین گاڑہ دیتا ھے ۔ اس طرح کی بڑی بڑی رقومات صرف کرنے سے ھمارا ملك ضرور آگے بڑھےگا لیکن پانچ دس سال کے بعد ۔ آج ھمارے پاس فوری سوال روزی کا ھے اسلئے چھوٹے ذرائع آبپاشی پر جو توجہہ نہین کی جارھی ھے اوس پر فوری توجہہ کرنے کی ضرورت ھے ۔ میرے علاقہ میں جہاں ایك سو سے زیادہ تالاب کنٹے ھین انہیں تعمیرات والے اپنے تالاب یا کنٹے نہین کہتے کیونکہ وہ سابقہ جاگیری علاقے کے ھین ۔ آج ان تالاب اور کنٹون پر رقم صرف کی جاتی تو سیکڑون ۔ ھزارون ایکڑ زمین پر فصلین زیادہ ھوتین اور نتیجتاً سیکڑوں ۔ ھزاروں لوگوں کی حالت بہتر ھو جاتی ۔ لیکن افسوس ھے کہ اس جانب کوئی توجہ نہین ھو رھی ھے ۔

راجو صاحب نے فرمایا ھے کہ پلاننگ اور ڈولپمنٹ کے تحت یعنے ھر گاؤں کے تحت کم از کم پانی پینے کے لئے ایك باولی ھو ۔ مین یہ کہے بغیر نہین رہ سکتا ۔ مسٹر اسپیکر سر ۔ کہ میرے علاقہ مین ایسے مواضعات ھین جہاں تین تین میل تك جاکر پانی لانا پڑتا ھے ۔ لوگ چارپائی پر بیٹھکر اشنان کرتے ھین اور اوسی پانی سے کپڑے دھوتے ھین ۔ ارٹ پلی ۔ یکےموری وغیرہ کے مواضیات کو دیکھئیے وھاں آج برسوں کے بعد بھی باولیاں نہین بنی ھین ۔

شری وی ۔ بی ۔ راجو ۔ کیا یہہ علاقے بلاك ایریا میں ھین ۔

شری اپا راؤ ۔ جی ۔ بلاك تو ابھی نہین دئے ھین ۔ ابھی اسکو ملنے کے لئے کتنے دن ھین معلوم نہین ۔ پہلے منسٹرس کو ۔ ڈپٹی منسٹرس کو اور باا‌ثر لوگوں کو بلاکس ملنے کے بعد اس پچھڑے ھوے جاگیری علاقے (اپا راؤ کے علاقے) کو بلاك ملیگا میں یہہ توقع رکھتا ھون ۔ بلاك ملنے کے تعلق سے جیسا کہ کملادیوی نے فرمایا (اگر مین بیجا نہ کہوں) تو اثرات استعمال ھوتے ھین ۔ گذشتہ حکومت میں رام کشن راؤ صاحب کے زمانے میں جتنے منسٹرس تھے انکو بلاکس ملے ۔ جتنے ڈپٹی منسٹرس تھے انکو بلاکس ملے ۔ جتنے باا‌ثر آدمی تھے انکو بلاکس ملے ۔ لیکن ھم صاف اور سچ بولتے ھین ۔ ذرا سخت بولتے ھن اسلئے ھماری طرف خیال نہین ھوتا ۔ آج ھمارے جاگیری علاقہ میں جہاں راستہ نہین ھے ۔ جہاں پینے کے لیئے پانی نہین ھے ۔ جہاں لوگ ایك ایك دانے کیلئے ترستے ھین وھاں بلاك دینگے تو آپ کی مہربانی ۔ ھم آپکا شکریہ ادا کرینگے

نہین تو ۱۹۶۱ء کے بعد سہی۔ تہرڈ یا فورتہہ پلان میں کبھی نہ کبھی اسطرف آپکا دھیان ہوگا اور کبھی نہ کبھی ہم کو بلاک ملیگا۔ ہم یہ اُمید رکھتے ہین۔

اسکے بعد جسطرح واویلاہ گوپال کرشنیا صاحب نے کہا (اور معاف کرنا عام تجربہ یہی ہے) کہ لیڈی یس۔ ای۔ اوز۔ رکھے جاتے ہین۔ بلاک میں کام نہیں ہوتا۔ وہ بیکار رہتے ہین۔ اس طرح ہماری قومی دولت صرف کیجارہی ہے میں نے ایک دو نہین پانچ مقامات پر ظہیرآباد اور مرزا پور میں یہ واقعہ خود دیکھا ہے شیخاپور اور ملکارپور وغیرہ میں یہ حالت ہے۔ وہان جو ین۔ ای۔ یس۔ بلاک ہے اوسکو پوسٹ اکسٹنسیو بلاک بنایا جا رہا ہے۔ شیخاپور موضع میں جو بلاک ہے وہاں صرف ایک مرتبہ قادرخان صاحب گئے ہین تین سال پہلے۔ اس کے بعد وہاں کوئی نہین گیا۔ جہاں سڑکین ہین وہان جاتے ہین۔ (The bell was rung)

آپ نے فرمایا تھا کہ جب ایک مرتبہ بات کرنے کا موقع ملتا ہے تو جنرل ڈسکشن بھی کرلے سکتے ہین اور اپنی ضروریات بیان کر سکتے ہین اسلئے میں آپ سے توقع کرتا ہوں کہ آپ مجھے اور کچھہ موقع دینگے۔

اس کے بعد شوگر فیکٹری سے متعلق کچھہ کہنا چاہتا ہوں۔ ظہیرآباد کے علاقہ میں کافی نیشکر ہوتا ہے۔ میتھا کمیٹی رپورٹ دیکھنے کے بعد معلوم ہوتا ہے کہ چھوٹے پیمانہ پر جیسے کہ آعظم آباد وغیرہ میں ہے شوگر فیکٹری ایک لاکھہ کے سرمایہ سے چلا سکتے ہین۔ جس میں ایک سو مزدور لگائے جاسکتے ہین۔ اگر ایسی فیکٹریز مرزا پور اور ظہیرآباد میں ہوں تو ایک نہین کئی کارخانے چلینگے۔ جس سے کئی لوگوں کو روزگار مل سکتا ہے اور کئی کاشتکاروں کی حالت درست ہوسکتی ہے۔ آج گڑ کا بھاؤ بائیس چوبیس روپیے فی من ہے۔ میں آپ سے عرض کرتا ہوں کہ میں نے ڈھائی ایکڑ پر بارہ سو روپیہ خرچ کرکے نیشکر کی کاشت کی تو چودہ من گڑ ہوا۔ ڈھائی ایکڑ پر کہاد دیکر۔ پانی دیکر محنت کرکے کاشت کی گئی۔ اس طرح آج گنے کی پیداوار کرنے والوں کی ایسی خراب حالت ہے۔ ادرک بوتے ہین تو ادرک کا بھی یہی حال ہے۔ بیس روپیہ من تین سال پہلے اس کی قیمت تھی۔ آج سوا دو روپیہ من سے زیادہ قیمت نہین ہے۔ اس طرح آج ہماری حالت خراب ہے لہذا جناب توجہہ کرکے بلاکس دینے میں کوتاہی نہ کرین۔ میں منسٹر صاحب سے عرض کرونگا کہ ایک مارواڑی صاحب کشن گنج میں دان کر رہے تھے۔ وہ بھوکوں کو کھانا کھلانا چاہتے تھے۔ دو چار سو آدمی جمع ہوئے۔ انہون نے کہا جو لوگ صبح کو نہین کھائے ہین انکو پہلے دینگے جو کل پرسوں کھائے ہین یعنے دو تین روز پہلے کھائے ہین ان کو بعد میں دینگے۔ (The bell was rung) اس طرح جو لوگ دو روز کے بھوکے تھے ان کو کہا گیا۔۔۔۔

*శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు (వదమలపేట) : అధ్యక్షా, ప్లానింగ్ పద్ధతిలో మార్పులు కలుగుతున్నవని మంత్రిగారు తెలిపినందుకు చాలా సంతోషము. ఆ మార్పులను వెంటనే చేయాలని వారికి మీ ద్వారా విజ్ఞప్తి చేస్తున్నాను. N. E. S. బ్లాకులలో C. D. బ్లాకులలో భేదములను ఏర్పరచటంవల్ల వారిలో వారికి మనస్పర్థలు కలుగుతున్నవి కనుక ఆ భేదములను తీసివేసి, అన్నీ ఒకే రకముగా వుండేటట్లు చేయాలని మంత్రిగారికి మనవిచేస్తున్నాను.

First Stage Blocks కు 5 సంవత్సరాలలో 12 లక్షలు ఖర్చు అవుతుందని, 3 సంవత్సరములలో $4\frac{1}{2}$ లక్షలు ఖర్చు అవుతుందని చెప్పారు. ప్రారంభమైన తేదీనుండి గడువులోగా ఆ సొమ్మునంతా ఖర్చు చేయాలని మనవి చేస్తున్నాను. గౌరవనీయులైన మంత్రిగారు ఈ కార్యక్రమమును అభివృద్ధిచేసే పద్ధతులను సూచించమని గౌరవ సభ్యులను కోరారు. పంచాయితీలను అభివృద్ధి చేస్తేగాని దేశం అభివృద్ధి చెందదని అందరూ గమనించిన విషయమే. పంచాయితీలలో కక్షలు ఎక్కువగానున్నాయని, అచ్చటడబ్బు దుర్వినియోగం అవుతున్నదని కొందరు అభిప్రాయ పడుతున్నారు.

మనదేశాన్ని అభివృద్ధిలోనికి తీసుకురావాలని మనం అనుకొన్నప్పుడు మన ప్రజలను మనం నమ్మాలి. ప్రజలు అయోగ్యులు, మంచివారు కారు అనే అభిప్రాయం మనసులో వుంచుకొని దేశాన్ని ముందుకు నడిపించాలనుకొంటే అది కష్టసాధ్యమవుతుంది. మనప్రజలను మనంనమ్మి, ప్రతి గ్రామములోను పంచాయితీలను ఏర్పాటుచేయాలి. బ్లాకులు ఏర్పాటుచేసినచోట ప్రతిసంవత్సరములో అభివృద్ధి చేయవలసిన కార్యక్రమములను సక్రమంగా నిర్వహించవలెను. ఒక బ్లాకుక్రిందనున్న అన్ని గ్రామములలోను పంచాయితీ బోర్డులను ఏర్పాటు చేయాలి.

రెండవ విషయం, పబ్లిక్ కోఆపరేషన్‌లేదని కొందరు చెప్పారు. బ్లాకులలో ప్లానులు జయప్రదం కావటానికి పబ్లిక్ కోఆపరేషన్ ముఖ్యమే. పబ్లిక్ కోఆపరేషన్ లేకుండా కేవలం ప్రభుత్వమే కోట్లకుకోట్లు డబ్బుఖర్చుపెట్టి గ్రామాలను బాగుచేయటం సాధ్యంకాదు. "ఈ గ్రామం మనది. మన గ్రామం అభివృద్ధికి మనం తోడ్పడాలి. మీరంతా మీ గ్రామ అభివృద్ధికి కృషిచేయాలి" అని మేము గ్రామ ప్రజలకు చెబుతూనేవున్నాము.

ప్రప్రథమములో ప్రభుత్వం అడవులను కొట్టించి, ఇండ్లు కట్టించి, సాగు చేసుకోమని భూములు ఇచ్చి గ్రామములను అభివృద్ధిలోనికి తీసుకొనిరాలేదు. అచ్చట ప్రజలే కష్టపడి, తమశ్రమతో ఇండ్లు కట్టుకొని, గ్రామములను ఏర్పరచుకొని నివసిస్తున్నారు. ప్రజల కష్టముతోనే గ్రామములు అభివృద్ధిచెందినవి కనుక గ్రామముల అభివృద్ధికి పబ్లిక్ కోఆపరేషన్, శ్రమ, పరికరాలు అన్ని

కావాలి. బ్లాకులలో ఇప్పటి విధానమంతా కంట్రాక్టు పద్ధతిపై జరుగుతున్నది. రోడ్లు వేయటానికి ఎస్టిమేట్సు వేస్తారు. "100 కి 50 పాళ్ళు మేము ఇస్తాము. పని ముందుచేయండి తరువాత డబ్బు యిస్తాము" అని చెబుతారు. కంట్రాక్టు పద్ధతిలో అది సరైనదికావచ్చు. తమవద్ద డబ్బులేకపోయినా అప్పు తెచ్చి పనిచేసి తరువాత లాభాన్ని కంట్రాక్టరు పొందుతాడు. కాని గ్రామ ప్రజలు మేము పనిచేస్తామని ముందుకు వచ్చినపుడు "ముందు మీరు డబ్బుపెట్టి పనిచేయండి. తరువాత మేము ఇస్తామని చెప్పటం సరైనపద్ధతికాదు. పబ్లిక్ కోఆపరేషన్ లేకపోవటానికి ఈ విధానమే కారణమని మా అభిప్రాయము. గ్రామపంచాయితీలకు ఈ పని ఒప్పగించి, రోడ్డువేయటానికి గాని, బావులు త్రవ్వటానికి ఇచ్చేడబ్బు తరువాత ఇస్తామని" చెప్పకుండా ఉండాలి. కొంత సొమ్ము ఇచ్చి, కొంతపని అయినతర్వాత మరికొంతసొమ్ము ఇచ్చి, ఈవిధముగా అంచెలపద్ధతిపై ఇచ్చినా బాగుంటుంది. డబ్బు దుర్వినియోగం కాకుండా చూడటానికి **B. D. O** లు ఉన్నారు. గ్రామసేవకులు ఉన్నారు. **Jeeps** పై వెళ్ళి చూడవచ్చును. ఈ ప్రకారం పనిని తనిఖీచేసి డబ్బుఇస్తే బాగుంటుంది.

పంచాయితీ అధ్యక్షులకు 100 రూ.లు యిచ్చి పనిచేయమంటే, ఆయన ప్రజలదగ్గరకు పోయి "ప్రభుత్వ సహాయం వచ్చింది. వందరూపాయలు నాదగ్గర ఉంది. తలోక పార, తట్ట పట్టుకొని పని చేయడానికి రండి" అని చెబుతాడు. అప్పుడు గ్రామాలలో చక్కగా పనిచేయడానికి వారికి అవకాశం ఉంటుంది. అంతేగాని "ముందుగా మీరు పెట్టుబడి పెట్టండి. తరువాత ఇస్తాము" అంటే జరుగనేజరుగదు. ఇదే ' **Public Co-opearation** రాకపోవడానికి ముఖ్య కారణము. కొంత ద్రవ్యం దుర్వినియోగమైనాసరే, ప్రభుత్వం ఏవిధమైన సందేహం పెట్టుకోకుండా పంచాయితీలను నమ్మి కొంత సహాయం చెయ్యండి. మా ప్రాంతంలో ఒక మహానుభావుడు రోడ్డు వేయడానికి నాలుగున్నరవేలు ఖర్చుచేశాడు. ఆ పైకం ఎస్టిమేట్సు వగైరాలకు అయింది, ఎన్నో మాసాలు అయింది. ఇంతవరకు ఆ డబ్బు రాలేదు. అట్లా పెట్టుబడి పెట్టి చేసేవాళ్ళు ఎంతమంది ఉంటారు? మానవ స్వభావాన్ని మనం గుర్తించాలి. మానవ ప్రకృతిని తెలుసుకొని వ్యవహరించాలి. తనకు లాభం వచ్చేటట్లు ఉంటేనే యేమానవుడైనా ఏదైనా చేస్తాడు. అసలు ప్రస్తుత విధానంలోనే మార్పు తీసుకొనిరావాలి, సైకలాజికల్ అప్రోచ్ కావాలి, ప్రజలను ఆకర్షించేటట్లు చేయాలి. ఆప్రకారంగా చేసినట్లయితే ప్లానింగు అతిత్వరలో వృద్ధికావడానికి యేవిధమైన ఆటంకం ఉండదని నా యొక్క అభిప్రాయం.

గ్రామాలలో, ముఖ్యంగా, ప్రభుత్వంవారు తీసుకొన్న ఎస్టేటు గ్రామా లలో, ఏ సౌకర్యం ఉన్నా లేకపోయినా యిరిగేషన్ సౌకర్యాలు చక్కగా ఉండేటట్లు చూడాలి. ఆ గ్రామాలలో ఏ తాతలనాడో, ఏ మహానుభావుడో

నిర్మించిన బావులు, చెరువులు తప్ప యింక ఏమీలేవు. ఇప్పటివరకు ఒక తట్ట మన్ను పోసినవారు యెవరూ లేరు. వాటిని చక్కబరచటానికి ప్లానులో కానీయండి- ప్లాను బయట కానీయండి— యేదోవిధంగా సహాయపడాలి. ఆ ఎస్టేట్సులోని ఇరిగేషన్ సోర్సెస్‌ను బాగుచేయాలి. ఇది నా రెండవ సూచన. ఈవిధంగా చేసినట్లయితే గ్రామాలలో ఉండేవారి యొక్క సహాయం మనకు లభ్యమవుతుంది. మా జిల్లావంటి జిల్లాలలో మాకుప్రాజెక్టులు ఏమీ లేవు, సేద్యం అంతా నూతులు, చెరువులమీదే అధారపడి యున్నది. కాబట్టి వాటివిషయమై శ్రద్ధవహించవలసినదని కోరుతున్నాను. మంత్రిగారు సెలవిస్తూ "రాబోయే సంవత్సరంలో 78 బ్లాకులు మన రాష్ట్రానికే ఇచ్చారు. అందులో 18 frist stage blocks" అని చెప్పారు.

శ్రీ వి. వి. రాజు : రాష్ట్ర ప్రభుత్వం అంచనా అని చెప్పాను.

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు : అంటే 31 బ్లాకులు వస్తుంది అన్న మాటేకదా! 18 frist stage blocks, 13 ప్రిపరేటరీ బ్లాకులు. ప్రిపరేటరీ అన్నందువల్ల ఏమి సహాయం వస్తుంది? దానినికూడ ఫస్టుస్టేజి బ్లాక్ లాగ చేయకూడదా? అలా చేసినందువల్ల ఖర్చు ఏమైన యెక్కువ అవుతుందా? ఆ వివరాలు మంత్రిగారు సెలవిస్తే బాగుంటుంది. 18 బ్లాకులు అయినట్లయితే ఒక్కొక్క బ్లాకు ఒక్కటికూడ రాదు. అట్లాఅయితే చాలా అశాభంగంగా ఉంటుంది. ఆ 31 ని కూడ First Stage Blocks గా మార్చే ప్రయత్నం చేస్తే బాగుంటుందని మనవి చేస్తున్నాను. ప్లానింగ్ కమిటీలకు జిల్లాలో కలెక్టర్లు అధ్యక్షులుగా ఉంటున్నారు. అదేప్రకారంగా బ్లాకు కమిటీలకు R. D. O. అధ్యక్షులుగా ఉంటున్నారు. ఇది కొంతవరకు ప్రజలలో తృప్తికరంగా లేదు. ప్రభుత్వంవారు యిదివరలో ఒక ప్రకటనకూడ చేసి ఉన్నారు. అనధికారులనే అధ్యక్షులుగా వేయుటకు ప్రయత్నిస్తామని ఆ ప్రకటనలో వ్రాశారు. అది నేను చూచాను. కాని ఆ విషయం ఏమైనదో తెలియదు. ఆ కమిటీలకు అనధికారులనే అధ్యక్షులుగా ఉంచితే బాగుంటుందని, ప్రభుత్వమువారు ఆ విషయం గమనించాలని కోరుతున్నాను. ముఖ్యంగా యిక్కడ నేను చెప్పేది, పంచాయితీలను ప్రారంభించి ప్రజాసహకారం లభ్యం కావడానికి పనిచేయాలని, పంచాయితీలకు తగినంత డబ్బు కేటాయించాలని, ఇరిగేషన్ సౌకర్యాలను బాగుచేసి అభివృద్ధి పరచాలని, అట్లు చేసినట్లయితే ప్రజాసహకారం లభ్యం కావడానికి ఎట్టి ఆక్షేపణ ఉండదని ఆ ప్రకారంగా ప్రభుత్వంవారిని చేయవలసినదిగా కోరుతున్నాను.

*శ్రీ కె. వెంకటరత్నం (వుయ్యూరు) : అధ్యక్షా, ప్లానింగు మంత్రిగారు ప్రవేశపెట్టిన డిమాండును బలపరుస్తున్నాను. వారు చెప్పిన విషయాలు, ఈ

new set up ను ఎంతవరకు ముందుకు తీసుకొని పోగలవు అన్నది సందేహం గానే ఉన్నది. నిజానికి N. E. S. లో గాని సి. డి. ప్రాజెక్టులలోగాని ప్రభుత్వానికి ఒక పోలసి ఉన్నదా అనిపిస్తున్నది మెహతా కమిటీ రిపోర్టు ప్రకారం 5 సం. లలో 12 లక్షల రూపాయలు First Stage Block లో ఖర్చు పెడుతున్నట్లు చెప్పారు నిజంగా ఈ బ్లాకుల విషయంలో ప్రభుత్వం ఒక నిర్ణయానికి వచ్చినట్లయితే ఆ నిర్ణయానికి ఈ మంత్రివర్గం కట్టుబడి ఉంటుందా? గడచిన ప్రభుత్వాల పద్ధతులు చూచినట్లయితే మదరాసు ప్రభుత్వంలో ఒక పద్ధతిఅనుసరించారు, ప్రకాశంగారి ప్రభుత్వంలో ఒక పద్ధతి అనుసరించారు. ఈనాటి పద్ధతి వేరు. ఒక బ్లాకులో 5 సంవత్సరాలలో 12 లక్షలు ఖర్చుపెట్టి రెండవ స్టేజిలో 5 లక్షలు ఖర్చుపెట్టాలి. అన్న పద్ధతి ప్రకారం జరిగినట్లయితే యివి 1968 సంవత్సరానికి కూడ పూర్తి కావు. కొన్ని బ్లాకులను 10 సంవత్సరాలవరకు వదలిపెట్టినట్లు అవుతుంది. ఉన్నచోట లాభం కలుగుతుంది. లేనిచోట్ల పూర్తిగా వదలివేయడం జరుగుతుంది దీనినిబట్టి చూచినట్లయితే యిప్పుడుఉన్న M.L.A లే తిరిగి యింకోసారి ఎన్నిక అయి ఈ ప్రభుత్వమే యింకోసారివస్తే యివి పూర్తి అవడానికి అవకాశం అందవచ్చునేమో! వారు చెప్పినప్రకారమే యివి పూర్తి కావడానికి పది సంవత్సరాలు పడుతుంది.

మిస్టర్ స్పీకర్ : మీరు వస్తారో లేదోకూడా తెలియదుగా!

శ్రీ కె. వెంటకరత్నం : ఇప్పుడు ఉన్న పద్ధతి ప్రకారం బాగానే జరుగుతున్నది. అది అందరూ అంగీకరించిన విషయమే! అక్కడక్కడ కొన్ని లోపాలు ఉన్నట్లయితే సర్దుకోవచ్చు. ఇకపోతే 78 బ్లాకులకుగాను 18 బ్లాకులు చేయబోతున్నట్లు సెలవిచ్చారు. కేంద్రప్రభుత్వం చెప్పినప్రకారం చేస్తున్నామని చెప్పారు. ఆంధ్రప్రదేశ్‌లో 20 జిల్లాలు ఉన్నాయి. 18 బ్లాకులు అంటే, జిల్లాకు ఒకటికూడరాదు. ఇట్లాచేసినట్లయితే ఎప్పటికి మన గ్రామాలు మనం అనుకొన్నరీతిలో అభివృద్ధి చెందుతాయి? వచ్చే 5 సంవత్సరాలలోనూ మనం ఎంత చేయగలుగుతామన్నది అనుమానంగానే ఉన్నది. అందుచేత మంత్రిగారు తిరిగి ఒకసారి ఆలోచించి, అవసరమైన మార్పులను చేయవలసినదిగా కోరుచున్నాను. ఈ 18 బ్లాకులతో 13 ప్రివరేటరి బ్లాకులనుకలిపి మొత్తం 31 బ్లాకులుగానైనా చేస్తే, కనీసం జిల్లాకు ఒకటి అయినావచ్చి, కొంతభాగం అయినా అభివృద్ధి చెందడానికి అవకాశం ఉంటుంది. బ్లాకు కమిటీలగురించి చాలమంది చెప్పారు. ఈ జిల్లా ప్లానింగు కమిటీలకు పెట్టేఖర్చు ఎంతఅవుతున్నదీ ఒక్కసారి లెక్కవేసుకొంటే బాగుంటుంది. ఈ కమిటీ మీటింగులకు జిల్లాలో ఉన్న ఆఫీసర్లను హెడ్ క్వార్టర్సుకు పిలుస్తారు వాళ్ళకు T. A. లు యివ్వాలి. ఆఫీసర్లేకాకుండా నాన్ఆఫీషియల్స్‌కూడ వస్తారు. వాళ్ళకు T.A. లు యివ్వాలి.

ఒక్కగంట మీటింగుకోసం ఎంతఖర్చు అవుతోందో ఒక్కసారి ఆలోచించమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఈ విధానంలో మార్పుచేయాలని ప్రభుత్వానికి సూచిస్తున్నాను. చాలా అన్యాయంగా డబ్బు ఖర్చుచేయడం జరుగుతోంది. ఈ డబ్బును యింకోదానికి ఖర్చుచేసినట్లయితే బాగుంటుంది.

లంచగొండితనం ఎక్కడచూచినా విపరీతంగా ఉంది. ఎవరైనా పట్టుకోడానికి వచ్చినట్లయితే, కేసులుపట్టి యివ్వడానికి సిద్ధంగా ఉన్నాం. దుబారా ఖర్చులు చాలా అవుతున్నాయి. ప్రజలనుంచి వచ్చిన విరాళాలు, కేంద్ర ప్రభుత్వం యిచ్చిన గ్రాంటులు, రాష్ట్రప్రభుత్వం యిచ్చిన సొమ్ము వాటిని సక్రమంగా ఖర్చుపెట్టేటట్లు చూడవలసిన బాధ్యత మనపై యున్నది. లంచగొండితనం యింకాపోలేదు. ఆ విషయంలో మంత్రిగారు పొరపడుతున్నారేమోగాని యింకా ఉన్నది. దీనికి ఖచ్చితమైన మార్గం ఆలోచించాలి.

లోకల్ డెవలప్‌మెంటు వర్క్సుకు ప్రభుత్వం ఖర్చుపెట్టవలసిన డబ్బు సకాలంలో అందకపోవడంవల్ల సద్వినియోగం కావడంలేదు. ఈ డెవలప్‌మెంటు పథకాలు కేంద్రప్రభుత్వ ఆమోదం పొంది కొంత ఆలస్యంగా వచ్చినప్పటికీ, వాటిని రాష్ట్ర ప్రభుత్వం జిల్లాకలెక్టర్లకు, ప్లానింగ్ ఆఫీసర్లకు, తహశీల్‌దార్లకు తెలియజేయునాటికి ఫిబ్రవరి, మార్చి నెలలు వస్తున్నాయి. ఈ 1-2 నెలల్లోను పనులను పూర్తి చేయాలనే ఆదుర్దాతో, వాటిని తొందర తొందరగా చేయడం, పనులు సరిగ్గా జరుగక, ప్రజలకు ఉపయోగం లేకుండా పోవడము, డబ్బు దుర్వినియోగం కావడమూ జరుగుతున్నాయి. కాబట్టి ఇంత ఆలస్యంగా ఆమోదాలను తెలపకుండా, కొంచెం టైము ఉండగానే తెలియజేసి డబ్బు సద్వినియోగమయ్యేటట్లు చూడమని మనవి చేస్తున్నాను.

ఫిర్కాలోని గ్రామాలన్నీ ఒకే బ్లాక్ క్రిందకు రావడంలేదు. నందిగామ తాలూకాలో అక్కడక్కడ కొన్ని గ్రామాలను ఈ కార్యక్రమం క్రిందకు తీసుకొన్నారు. ఒక ఫిర్కా లేక తాలూకాలోని గ్రామాలన్నిటినీ ఒకేసారి ఈ బ్లాకుల క్రిందకు తీసుకోకుండా, కొన్నిటిని వదిలివేయడం న్యాయం కాదని మనవి చేస్తున్నాను. ఈ కార్యక్రమంలో వెనుకబడిన ప్రాంతాలకు ముందు ప్రాధాన్యం యివ్వాలని మనవి చేస్తున్నాను. వీటి విషయమై ప్లానింగ్ మంత్రిగారికి, ముఖ్యమంత్రిగారికి తెలియజేసి ఉన్నాను. వారు శీఘ్రంగా తగినచర్యలు తీసుకొంటారని ఆశిస్తూ నేను శలవు తీసుకొంటున్నాను.

*శ్రీమతి వై. సీతాకుమారి (ఖాన్పువడ): అధ్యక్షా! ప్లానింగ్ అండ్ డెవలప్‌మెంటుశాఖా మంత్రిగారు ప్రవేశపెట్టినపద్దును నేను ఆమోదిస్తున్నాను. ప్రణాళికలు, ఈనాడు ప్రజలకు చాలా అవసరంగా ఉన్నాయి, ముఖ్యంగా వెనుకబడిన తెలంగాణా ప్రజలకు అమృతప్రాయంగా ఉన్నాయి. తెలంగాణా

గ్రామాలలో రోడ్లు సరిగాలేవు. చెరువులు గండ్లుపడి ఉన్నాయి. ముఖ్యంగా నిజామాబాద్ జిల్లాలోని ఖాన్సువడలో ఒక గ్రామంనుంచి ఇంకో గ్రామానికి రోడ్లులేవు, ఎన్నో చెరువులు మరామ్మతు లేకుండా ఉన్నాయి. అక్కడి ప్రజలు ఏదోవిధంగా పంటలుపండించి, కొంత మిగుల్చుకొంటున్నారు. వారు చిన్న మొత్తాల పొదుపు ఉద్యమానికి contribute చేశారు. Development కార్య క్రమాలకు, చెరువుల repairs కు కొంత contribute చేయడానికి సిద్ధంగా ఉన్నారు. కాబట్టి ప్లానింగ్ మంత్రిగారు తెలంగాణా ప్రజలను దృష్టిలో ఉంచుకొని ఈ జిల్లాలలో పర్యటనచేసి వారి కష్టాలను తొలగిస్తారని ఆశిస్తున్నాను.

నిజామాబాద్ జిల్లాలో దేశాయిపేట అనేచోట పెద్దచెరువు ఉంది. దాని కట్ట చెడిపోయింది. దీని మరామ్మతుకు ప్రజలు చందాలు ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నారు. గనుక మంత్రిగారు ఈవిషయంలో శ్రద్ధతీసుకోవలసిందిగా కోరుతున్నాను. అదేవిధంగా ఎత్తొండ అనే గ్రామానికి అక్కడి ప్రజలు రు. 12 వేల రూపాయలు కష్టంచేసి రోడ్డువేసికొన్నారు. దానికి కాస్త metal వేయించమని ప్రభుత్వాన్ని కోరుతున్నారు. ఈ విధంగా గ్రామ ప్రజల నిత్యజీవితానికి సంబంధించిన సమస్యల సత్వర పరిష్కారానికి పూనుకొనవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతూ నేను విరమిస్తున్నాను.

*శ్రీ వి. గోపాలకృష్ణ (పిఠాపురం) : అధ్యక్షా, మంత్రిగారు ప్రతిపాదించిన demand ను నేను బలపరుస్తున్నాను. Post Intensive Blocks లోని కొన్ని గ్రామాల్లోను, కమ్యూనిటీ ప్రాజెక్టులోని కొన్ని గ్రామాల్లోను ఏ పనులూ జరగలేదు. National Extention Services Blocks లో ఉన్న advantages Post Intensive Blocks లో లేకపోవడంవల్ల అక్కడ బొత్తిగా పనులు జరగడంలేదు. వాటన్నిటినీ ఒక level కు తీసుకువస్తున్నామని మంత్రిగారు చెప్పడం శుభసూచకంగాఉంది. ఈ బ్లాకులకు ఏర్పాటుచేయబడిన సలహా సంఘాలు కేవలం నామమాత్రంగా ఉన్నాయి. వాటియొక్క బాధ్యతకాని, అవి చెప్పే పనులు చేయడంకాని ఏమీ జరగడంలేదు. కాబట్టి వీటిని తీసివేసి ప్రభుత్వం తమ officers ద్వారానే పనులు చేయించుకోవడం మంచిది. ప్రజాప్రతినిధులైన శాసనసభ్యులనో, లేక గ్రామంలోని పెద్దలనో ఆ కమిటీలకు అధ్యక్షులుగా పెట్టి వారి సలహాలను పాటించకపోవడం మంచిదికాదు. ఈ విధంగా చేయడం ప్రజాస్వామ్యానికి అనుగుణ్యంగా ఉండదు.

వ్యవసాయాభివృద్ధికి, చిన్న తరహా పరిశ్రమలకు అప్పులుఇచ్చే సందర్భంలో కూడా ఈ కమిటీలను సంప్రదించడం జరగడంలేదు. తిరుపతి వెంకటేశ్వర్లకు ప్రొద్దుట ఆ క్రితం రోజు వసూలైన పద్దులు ఏ విధంగా చదువుతారో అదేవిధంగా, ఈ అప్పుల పట్టికను కమిటీలలో చదువుతున్నారు. ఆ loans

ఏ విధంగా sanction చేశారని అడుగుటకు వీలుకానివిధంగా officers ప్రవర్తిస్తున్నారు. కాబట్టి ప్రభుత్వం ఈ కమిటీలను నామమాత్రంగా appoint చేయడం అనవసరం. అన్నిపనులు తమ executive officers ద్వారా నేచేయించుకోవచ్చు.

తూర్పు గోదావరి జిల్లాలో ఈ Blocks లోని ఆఫీసర్ల సంఖ్య పెరుగుట వల్ల వారిపేర్లు కూడా మాకు తెలియడం లేదు. Small Scale Industries పైన ఒక officer ను వేశారు ఈయన ఎవరికి Subordinate అనే విషయం తెలియడంలేదు. జిల్లా Planning Officer పర్యవేక్షణక్రింద పనిచేస్తున్నారా అంటే అది ఏమీ కనిపించదు. వారు ఎప్పుడూ జీపులో తిరుగుతూ ఉండటం, ఎంతసేపు, మాట్లాడినా కర్రు, కర్రు లాడుతూ మాట్లాడటమే కాని వారు చేసే పని ఏమీ కనిపించడంలేదు. కాబట్టి మంత్రిగారు, ఈ officer ఆ జిల్లాకు వచ్చిన నాటినుంచీ చేసిన పనేమిటో, ఎన్ని కుటీర పరిశ్రమలకు ధన సహాయంచేశారో, ఎన్ని కుటుంబాల ఆర్థికసౌష్టవం అభివృద్ధి చెందిందో, విచారణ చేయవలసిందిగా కోరుతున్నాను.

ఈ జిల్లాలో ఆదర్శప్రాయంగా పనిచేస్తున్న ఒక సహకార సంస్థ తమ ప్రజల, రైతుల ఆర్థికపరిస్థితిని అభివృద్ధి చేసుకొనుటకు ఒకSoap Factory పెట్టుకొంటామని, దానికి loan ఇప్పించమని దరఖాస్తు పెట్టుకొన్నారు. కానీ యీ సంస్థకు loan ఇవ్వకుండా ఒక private వ్యక్తికి ఇచ్చారు ఇదెక్కడి న్యాయమని అడిగితే, ఆ private factory ఏ విధంగా పనిచేస్తుందో పరిశీలించిన పిమ్మట, మీ case ఆలోచిస్తామని చెబుతున్నారు. "Socialistic Pattern of Society; Co-operative Commonwealth" ను స్థాపిస్తామని చెప్పే ప్రభుత్వము చేయవలసిన పనేనా ఇది ? అని అడుగుతున్నాను. ప్రజాధనం ఏ విధంగా వినియోగింపబడుతుందో, దాని మైన ప్రతిఫలం ఏమి వస్తుందో ఆలోచించకుండా అసందర్భంగా ఖర్చుచేయడం న్యాయంకాదు. ఈ విషయాలను ప్రభుత్వ దృష్టికి, అయిదు నెలలక్రితం తీసుకువచ్చాను. ఇంతవరకు ఎట్టి చర్యలు తీసుకోలేదు.

మంత్రివర్గంలో మంత్రులు ఉండటం కేవలం policies నిర్వచనానికి మాత్రమే కాదు. వాటిని Executive Officers చేత అమలు చేయించవలసిన బాధ్యతకూడా వారిపైనే ఉంది. కానీ ఈ నాడు మన రాష్ట్రంలోని పరిస్థితి చూసినట్లయితే మన మంత్రులకు Executive Officers పై వత్తిడి తీసుకువచ్చి, ఈ polocies ను అమలు జరిపించే ధైర్యం, స్థోమత లేదేమోనని, కాంగ్రెస్ పక్షంనుంచి నేను చెప్పవలసి వస్తున్నందుకు విచారిస్తున్నాను.

*శ్రీ ఎం. సత్యనారాయణరాజు : అధ్యక్షా, Planning and Development కు సంబంధించిన policy వెనుక తోకవాటంగా వస్తున్నట్లు ఇదివరకటి

నుంచి మేమందరమూ చెబుతూ వస్తున్నాము. ఇప్పుడు మంత్రిగారు ఇచ్చిన ఉపన్యాసంలో కూడ ఇదే ఋజువు అవుతున్నది గ్రామాలలో ఈ కార్యక్రమా లను ఏ సంవత్సరానికి ఆ సంవత్సరం పొడిగిస్తూ వస్తున్నారు. మొత్తంమీద ఇది సన్నిగిల్లుతున్నదని చెప్పకతప్పదు. జిల్లా స్థాయిలో ఒక council గ్రామ స్థాయిలో ఒక council పెట్టడంవల్ల, ఇవన్నీ సక్రమంగా ప్రజాస్వామికంగా పనిచేస్తాయని మంత్రిగారు చెప్పారు. కాని ఇప్పటి పరిస్థితులనుబట్టి చూస్తే ఇది అంతగా నమ్మదగినమాట కాదు. ఎందుచేతనంటే, ఈ block councils కు ఎన్నికలు పెట్టకుండా ఎవరినో nominated గా చేసుకొని Block Development Officer ద్వారా వాటిని అమలు జరుపుతూ ఉన్నారు. అదేవిధంగా జిల్లా council కు కూడ indirect గా nominate చెయ్యడం జరుగుతున్నది. ఈ మాదిరిగా false nucleus మీద blocks councils, జిల్లా councils ఏవిధంగా పనిచేస్తాయో, చెప్పడానికి సందేహిస్తున్నాను. చాలామంది ఈ విధంగానే అనుమానిస్తున్నారు. అంతేగాక వీటిని అన్నింటినీ, officer ల తోనే పనిచేయి స్తున్నారు. వారే ఆధిపత్యం వహిస్తూ chairman లుగా ఉంటున్నారు. అలాం టప్పుడు ప్రజలు వారికిఇచ్చే సలహాలను వారు పాటిస్తే పాటించవచ్చు లేకపోతే కొట్టివేయవచ్చు. దానికి మరే appeal ఉండదు. ఈ విధంగా ఇంతకుముందు ఎన్నో జరిగాయి, అవన్నీ ప్రభుత్వదృష్టికి తీసుకురావడం జరిగింది. వీటిని అన్నిం టినిచూస్తే, దాని తాలూకు administration కేవలము నిరంకుశత్వంగా నడుస్తున్నదని చెప్పకతప్పదు. ప్రభుత్వముయొక్క policy అనుసరించి వాళ్ళ అధికారం నిలబెట్టుకోవడానికి ఈవిధంగా చేస్తున్నట్లు స్పష్టంగా కనబడుతున్నది.

ముఖ్యంగా ఈ Block Councils, block headquarters పెట్టదలచు కొన్నప్పుడు ప్రజలకు అందుబాటులో పెట్టి, వాళ్ళ సౌకర్యాల దృష్ట్యా పని చెయ్యవలసి ఉన్నది. అంతేగాక, ప్రభుత్వము లక్షలకు, లక్షలు డబ్బుతెచ్చి ప్రజలకు ఏ ఏ సౌకర్యాలు చెయ్యదలచుకున్నదో, ఏ ఏ సదుపాయాలను కల్పించ దలచుకున్నదో, ఆ డబ్బు అంతా వడ్డీలపై తీసుకువచ్చి ఖర్చుచేస్తున్నారు అన్న మాటను గుర్తులో ఉంచుకోవాలి. ఆ డబ్బును ప్రజలకు సక్రమంగా అంద చేయాలి. వారు సక్రమంగా వినియోగిస్తున్నారా? లేదా అనేవిషయం చూడాలి. దానివల్ల వారు సత్ఫలితాలను పొందేటట్లు చూడాలి. లేకపోతే

The whole show is an utter failure. The nucleus is very bad. By 1959 it will be a total failure and there will be a collapse of the whole scheme. That is the real position. If you don't believe it now, you will believe it in 1959, if not in 1958. I am speaking very frankly, and if you believe it I will be grateful, and if you don't believe it I donot mind it.

ఇకపోతే Block Council ఏదైనా పని ప్రారంభించేముందు వారు ఆ పనిని recommend చేసి, estimates తయారు చేసినా డబ్బు మాత్రం sanction కాదు. అదేవిధంగా Co-operative societies పెడతామని, ప్రజల దగ్గరనుంచి share capital వసూలు చేస్తారు, కాని ఒక్క Society register చెయ్యరు. లేక కనీసం వాళ్ళకు loan కూడ ఇయ్యరు. ప్రజలకు సదుపాయాలు కల్పించకుండా, సమానంగా పంపకాలు చెయ్యకుండా, మూడు మైళ్ళకు ఒక Block Head-quarters పెట్టడానికి ఏ ఉద్దేశ్యంమీద నిశ్చయిస్తున్నారో అర్థం కావడం లేదు. ఇందుకు సంబంధించి ప్రజలు ఏమైనా సలహాలు ఇస్తే, ప్రభుత్వ నిరంకుశ పరిపాలనకు అనుగుణ్యంగా ఉంటే వాటిని అంగీకరిస్తారు. కాని ప్రజల సౌకర్యాలకు సంబంధించిన సలహాలను అంగీకరించటంలేదని ఖచ్చితంగా చెబుతున్నాను. ఇప్పుడు N. E. S. Schemes మానేసి, ఏదో Community Development ప్రకారంగా 18 block లను పెట్టడానికి నిశ్చయించుకున్నారు. దీని అర్థం ఏమంటే, ఏదో కొద్దిపాటి area లు వృద్ధిచెందుతూ ఉంటాయి, block లో లేని area లో ప్రజలు 1967 వరకు లేక 1971 వరకు, శిస్తులు కట్టుకొంటూ నోరు తెరుచుకొని, చూస్తూ ఉంటారు. ఈ paper planning, Mehta Reports, ఇవన్నీ, ఒక dramatic show గా కనబడుతున్నాయి. ఈ విధంగా కాలక్షేపంచేస్తే అభివృద్ధి కాని ప్రాంతాలలో ఉన్న ప్రజలు, ఏ విధంగా పన్నులు కట్టగలుగుతారో, అధ్యక్షులవారు ఆలోచించాలని మనవిచేస్తున్నాను. అధికారులకు సంబంధించిన వారే, వీటి ప్రతిఫలం పొందుతున్నారు గాని, హీనస్థితిలో ఉన్న ప్రజలు పొందటంలేదని ఖచ్చితంగా చెబుతున్నాను.

ముఖ్యమంత్రిగారు మా జిల్లాలలో పర్యటించినప్పుడు, అక్కడి పరిస్థితులను గమనించి, షేర్ మహమ్మద్ పురంలోను, మురప్పాకలోను, block headquarters ను ఏర్పాటు చెయ్యమని చెప్పారు. మురప్పాక, షేర్ మహమ్మద్‌పురం block area కు అనుకునే ఉన్నది. మురప్పాక, Head-quarters లో సుమారు 87 గ్రామాలు ఉన్నవి. ఈ 87 గ్రామాల వాళ్ళు, 25 మైళ్ళు నుంచి, మురప్పాకకు వస్తూఉన్నారు. దానికి Trunk Road లేదు. మరి రైతులకు కావలసిన, ఎరువులు, విత్తనాలు, మొదలైనవి ఎన్నో వారు తెచ్చుకోవలసి ఉంటుంది. వారికి సరైన రోడ్డులేక ఎన్నో ఇబ్బందులు పడుతున్నారు. నేను Socialist అభ్యర్థిని అయినా, ఈ విషయాలు వారికి మనవి చేశాను. గిరిగారి, అభ్యర్థిత్వాన్ని ఎవరైతే support చేశారో, వాళ్ళకు, ఈ తాలూకా విషయాలను అప్పచెప్పారు. షేర్ మహమ్మద్‌పురానికి, మురప్పాకకు, రమారమి ఆరు మైళ్ళ దూరమేగనుక, షేర్ మహమ్మద్‌పురంలో పెట్టమని మేము కోరాము. Socialist Party, అభ్యర్థి, ఈ షేర్ మహమ్మద్ పురాన్ని బలపరుస్తున్నాడు. కాబట్టి, అక్కడ మానేసి, మురప్పాక, Head-

quarters లో, ఒక block council ను పెట్టమన్నారు ప్రజలు శ్రేయస్సు ఈ విధంగా చూస్తే, ఇంత అన్యాయానికి ఒడిగడుతుంటే, ప్రజల అభిప్రాయము ఏవిధంగా ఉంటుందో, గమనించాలని మనవి చేస్తున్నాను. పార్టీ అభిప్రాయ భేదాలు మనస్సులో పెట్టుకొని, ఏదో ఒక వ్యక్తికోసం పాటుపడడం, ఎంత వరకూ నిలబడదని మనవిచేస్తున్నాను. కావున ఎన్నో గ్రామాలకు పనికివచ్చే, block head-quarters ను, ఎక్కడికో తీసుకువెళ్ళి. ఏ మారుమూలలో పెట్టడం ఎంత అన్యాయమో గమనించాలని కోరుతున్నాను.

శ్రీ పి. బాపయ్య (తిరువూరు) : అధ్యక్షా, మంత్రిగారు ప్రవేశపెట్టిన ఈ డిమాండును బలపరుస్తూ కొన్ని విషయాలు మనవి చేస్తున్నాను. ఈ N.E.S., C. D Blocks లో మంత్రిగారు చెప్పినట్లు మొత్తముమీద ఇతర శాఖలలో వున్నటువంటి corruption లేదు అనడంలో వారితో నేను సంపూర్ణముగా ఏకీభవిస్తున్నాను. దానికి కారణమేమిటంటే corruption జరగడానికి అవకాశము లేదు. ఈ శాఖలో పనిచేసే ఉద్యోగస్థులకు ఏదో ప్రత్యేకత వున్నదని కాదు. ఎందుచేతనంటే ప్రజా సహకారముతో జరగవలసిన పనులు కాబట్టి ఈ శాఖలో corruption జరుగడానికి అవకాశం లేదు. కాని ఒక్క విషయం మాత్రం మంత్రిగారు దృష్టిలో పెట్టుకోవాలి. ఈ శాఖలో దుబారా ఎక్కువగా వుంది. ఇది మనకు అలవాటులో లేనటువంటి శాఖ కాబట్టి క్రొత్తగా పనులు చేస్తున్నాము కాబట్టి ఈ పనులలో కొంచెము దుబారా జరుగుతున్నది. ఆ దుబారా విషయము మంత్రిగారు దృష్టిలో పెట్టుకొని దానిని సరిచేసినట్లయితే ఇది సక్రమంగా జరుగుతుంది. బ్లాకుల విషయంలో నేను మనవి చేసేది ఏమిటంటే, ఇపుడున్న బ్లాకులు చాల పెద్దవి కొన్ని బ్లాకులు చాల చిన్నవి. ఈ పెద్ద బ్లాకులు కొన్ని చిన్న బ్లాకులకంటే విస్తీర్ణములోను, జనాభాలోను రెట్టింపుగా వున్నవి. అయితే బ్లాకులకన్నింటికి allotment ఒకేమాదిరిగావుంది. దానివల్ల పెద్ద బ్లాకులకు నష్టము కలుగుతుంది. చిన్నబ్లాకులకు సౌకర్యము గలుగుతుంది. కాబట్టి ఇకముందు వచ్చేబ్లాకుల విషయంలో దీనిని దృష్టిలో పెట్టుకొని Un-even Blocks కాకుండా Even Blocks గా వుండేటట్లు చూడాలని మనవిచేస్తున్నాను. కృష్ణా జిల్లాలో ఇదివరకున్న బ్లాకులు రెండు చాల పెద్దవిగావున్నవి. 1,10000,1,20000 జనాభాగలిగిన బ్లాకులు ఇవి. అవి నూజివీడు, తిరువూరు బ్లాకులు. వీటిని రెండు బ్లాకులుగా చేస్తారని తెలుస్తుంది. ఐతే రెండు బ్లాకులుగా చేసినపుడు క్రొత్త Block ను ఏర్పాటుచేసినట్లైతే అపుడు డబ్బు మొదటి బ్లాక్ పైనే ఖర్చుపెట్టడమవుతుంది. క్రొత్తగా ఏర్పాటుచేసే బ్లాక్ ప్రాంతములో తక్కువ ఖర్చు పెట్టడము జరుగుతుంది. ఈ విషయం దృష్టిలో పెట్టుకొని క్రొత్తబ్లాకును ఏర్పాటు చేయవలసిందని మనవిచేస్తున్నాను. రెండవ విషయమేమిటంటే irrigation విషయంలో ఇపుడు చెరువులు, కుంటలు మొదలైనవాటికి ఈ

irrigation పద్దు క్రింద రెండు మూడు లక్షల రూపాయలున్నది. దీనిక్రింద వాటిని బాగుచేసుకోవచ్చునని మంత్రిగారు చెప్పారు. ఇది కేవలము అప్పుల కొరకు ఏర్పడినదే కాని చెరువులనుకుంటలను బాగుచేసుకోడానికి అవకాశంలేదు. రైతులు ఆ అప్పుతీసుకొని ఈచెరువులను కుంటలను బాగుచేసుకోడానికి వీలులేదు. కనుక ఆ కుంటలు చెరువులు బాగుచేయడానికి Blocks క్రింద ఖర్చుపెట్టాలని నేను మనవిచేస్తున్నాను. తర్వాత ఈ బ్లాకులలో కొన్ని ఖర్చులు తగ్గించడానికి అవకాశముంది. ఇపుడు గ్రామాలలో "పొగరాని పొయ్యి" అని, "మరుగు దొడ్లు" అని వున్నవి. Block లో వున్న అన్ని గ్రామాలకు సంబంధించినది కాబట్టి ఈ పొగరాని పొయ్యిలకు ఒక target ఉంది. Planning Commission ఒక target పెట్టుకుంది ఆ target ప్రకారము, అన్ని పొగరాని పొయ్యి లున్నవా అని వాటిని ఏర్పాటుచేశారు. ఆ Block కు అవి అవసరమా, లేదా అవి ఉపయోగపడుతాయా, లేదా అనేది ఆలోచించాలి. నిజంగా గ్రామము లలో ఈ పొగరాని పొయ్యిలను ఏర్పాటుచేసుకోవడము సరిగా జరగడంలేదు. ఎందుకంటే మట్టిగోడల తాటాకు ఇండ్లలో వీటిని పెట్టడానికి అవకాశము లేదు. పెట్టితే అవి నామమాత్రముగా వుండవలసినవే కాని ఉపయోగపడడము లేదని మంత్రిగారికి మనవిచేస్తున్నాను. మన మీ బ్లాకులలో ఖర్చుచేయవలసిన items ను మార్చుకోవచ్చును. అవసరమయ్యేవాటికి ఖర్చుపెట్టి అవసరము కాని వాటికి ఖర్చు తగ్గించటానికి ప్రయత్నము చేయాలని మంత్రిగారిని కోరు తున్నాను. ఈ B. D. O. లను Revenue Department నుంచి తీసుకొస్తు న్నారు. వీరు ఇంతకుపూర్వము ఒక డిపార్టుమెంటులో వున్నారు. కనుక ఈ అధికారులు, ప్రజలు కలిసిమెలసి పనిచేయడానికి అవకాశముండదు. కనుక వారిని రివెన్యూ డిపార్టుమెంటునుంచి కాక direct గా B. D. O. లను తీసికొచ్చి నట్లయితే వారు ప్రజలతో కలిసిమెలసి వుండడానికి ఎక్కువ అవకాశ ముంది. ఇపుడు యీ new set-up లో village level workers ను ఇంకా ఎక్కువ చేస్తామన్నారు నిజమే. Village workers ను ఎక్కువ చేయవలసిన అవసర ముంది. ఈ Extension Officers ను పెట్టడము అవసరము లేదు. ఎక్కడైనా area పెద్దదిగా వుంటే పనులు ఎక్కువగా వుంటే Department లోనే ఇంకొక Officer ను వేయడము అవసరము కాని ప్రత్యేకంగా Extension Officers అవసరములేదని మంత్రిగారికి సలహాఇస్తూ సెలవు తీసుకుంటున్నాను.

*శ్రీ టి. జి. తిమ్మయ్యశెట్టి (కోసగి): అధ్యక్షా, ఈ పద్దును బలప రుస్తూ కొన్ని సూచనలు చేయదలచుకున్నాను. వెనుకటి మద్రాసు రాష్ట్రంలోని బళ్ళారి జిల్లా ఆలూరు తాలూకాలో 1948 నుంచి బ్లాక్ పని ప్రారంభించబడింది. అది ఇపుడు Post Intensive Block అయిపోయింది. ఈ Post Intensive Blocks లో skeleton staff మాత్రమే వుంటుందని అన్నారు. కనుక అది

ఎటుల జరుగుతుందో కొంచెము అనుమానముగానే వుంది. ఇక ఈ N. E. S. Blocks లో వున్న B. D. Os. చాలా చోట్ల చురుకుగా పని చేయడము లేదు. వాండ్లు tours కాగితముమీద వ్రాసుకోవడమే కాని తిరగడం మాత్రము చాల తక్కువ. ఇంకా కొన్నిచోట్ల Men S E. Os. Women S.E.Os. చాల inactive గా వున్నట్లు మాకు వార్తలు వస్తున్నవి General గా village workers ప్రతి గ్రామములోను 1, 2 రోజులు వుండి agriculture విషయము లోను, వెటర్నరీ విషయంలోను వారు training లో నేర్చుకొన్న విషయాలను ప్రజలకు చెప్పడము ప్రజలనుంచి కొన్ని సలహాలు పొందడము జరుగుతుంది కాని ఈ S. E. Os. (men and women) మాత్రము గ్రామాలలో పని చేయ డానికి ఉత్సాహంగా లేరని అనిపిస్తుంది. వాండ్లు B. A. చదవడము B. Ed. pass కావడమే కాని వాండ్లవల్ల ఏమి పని జరగడములేదు, అందులో ముఖ్యంగా ఆడవాండ్ల విషయం చాల శోచనీయంగా వున్నది. 15-20 మంది మొగ ఉద్యోగస్థుల మధ్య ఒక స్త్రీ వుండడమువల్ల, నిస్సహాయము, ఒంటరిగా వుండడమువల్ల నిస్పృహ కలుగుతుంది. అనవసర అపోహాలకుకూడా దారి తీస్తుంది.

శ్రీమతి వై. సీతాకుమారి : నిస్సహాయత్వము, ఒంటరితనము అని అను కొనేవాండ్లు ఆ ఉద్యోగానికి వెళ్ళరు. ధైర్యంగా పనిచేసేవాండ్లే వెళ్ళుతారు. ఆడది అనే మాట withdraw చేయాలండి దయచేసి.

మిస్టర్ స్పీకర్ : నేను అంగీకరించాను.

శ్రీ టి. జి. తిమ్మయ్యశెట్టి : I withdraw. స్త్రీలని అందాము. Sisters అన్నమాట. వారికి అలాంటి చిక్కులుండడంవల్ల గ్రామాలలో active గా పని చేయలేకపోతున్నారని నా ఉద్దేశం. అంతేకాని మరొక అపోహ, అనుమానం ఏమీలేదు. అందుచేత అయిదారుగురను ఒక గ్రూపుగా చేర్చి ఒక గ్రామసేవకుని క్రింద వేస్తే ఎక్కువ సహకారంతో పని అవుతుందేమో అని నా ఉద్దేశమేకాని ఏ విధమైన aspersions cast చేయడంకాదు. ఈ రకమైన ఇబ్బందు లుండడం వల్ల వీరికి 160, 180 రూపాయల వరకు జీతాలు యిస్తున్నప్పటికి దానికి సరిఅయిన return చాలా గ్రామాలతో లేనట్లే కనిపిస్తున్నది. ఈ కార్యక్రమాల వల్ల ఫలితాలు merely jugglery of figures అనిపిస్తోంది. ఎక్కువగా తనిఖీ లేకపోవడంవల్ల ఈ అంకెలు నిజమో అబద్ధమో తెలియకుండా ఉన్నది. జరిగినది జరిగినట్లు వ్రాస్తే ఎంతపని జరిగినది, ఎంతపని జరుగనిది తెలుస్తుంది. అందుచేత రిపోర్టులు పంపునపుడు జరిగినది జరిగినట్లుగా అతిశయోక్తులు (exaggerate) లేకుండా పంపవలసినదని ఉత్తరువు విస్తారనే ఆశిస్తున్నాను. బ్లాకు ముఖ్యస్థానం (Head-quarters) గ్రామాలలో ఉండరాదని తాలూకా ముఖ్యస్థానానికే

మార్చాలని మెహతా సంఘ నివేదికలో ఉన్నట్లు అంటున్నారు. ఆదోని తాలూకా ముఖ్యస్థానం. గవర్నమెంటు భవనాలున్నవి. అయినప్పటికి అక్కడ ఉండే ఇతర ఆఫీసులు అద్దె యిండ్లలో ఉంటున్నాయి. పెద్దతుంబలంలో బ్లాకు ముఖ్యస్థానం ఉండరాదని ఆదోనికి మార్చవలెనని ప్రయత్నం జరుగుతున్నది. అందుకు వందలకు వందలు సెలవుచేసి కంట్రాక్టర్లను పెడుతున్నారు. పెద్దతుంబలం కేంద్రంగా ఉంటూ ఫిర్కాకు ముఖ్యస్థానంగా ఉంటున్నది. అక్కడనుంచి బ్లాకు ఆఫీసును మార్చిన యెడల చాలా ఇబ్బంది అయిపోతుంది. అందుచేత బ్లాకు ముఖ్యస్థానం అక్కడే ఉండే ఏర్పాటు చేస్తారని అక్కడే భవనాలు కట్టడానికి ఏర్పాటు చేస్తారని ఆశిస్తున్నాను.

శ్రీ సి హెచ్. రాజేశ్వరరావు (చొప్పదండి): అధ్యక్షా, ప్రణాళికా శాఖామాత్యులు జాతీయ విస్తరణ ప్రణాళికకు, జాతీయ వికాస కేంద్రాలకు, స్థానికాభ్యుదయ ప్రణాళికలకు కొంతడబ్బు కావాలని ఈ పద్దును ప్రతిపాదించారు. ఈ ప్రణాళికలను విజయవంతం చేయడానికి ప్రభుత్వం తలపెట్టిన ప్రణాళికలన్నీకూడా వివరించారు. ఈ కార్యక్రమం అంతా పూర్తిఅయేవరకు అంటే 1968 వరకు ఎట్లా నడుస్తుందోకూడా వివరించారు. వారు పద్దులను కేటాయించినారు; ఖర్చుచేయడానికి స్కీములు వేసినారు. వాటిని విమర్శించవలసినపని నాకు లేదు. ప్రణాళికలను తయారుచేయడం, వాటికై ఖర్చు చేయడం ప్రభుత్వం అనుసరిస్తూఉండే విధానాలనుబట్టి ఉంటుంది. ప్రభుత్వ విధానాలను అమలుచేయడాన్నిబట్టి ప్రణాళికల విజయం, భవిష్యత్తు ఆధారపడి ఉంటుంది. కాంగ్రెసుప్రభుత్వం దేశంలో అధికారంలోనికి వచ్చినప్పటినుంచి జాతీయ విస్తరణ ప్రణాళికలవల్ల, జాతీయాభ్యుదయ ప్రణాళికలవల్ల వచ్చే పరిణామాలతో గ్రామసీమలలో విప్లవాత్మకమైన మార్పులు వస్తాయని దేశాభివృద్ధికి అది నాందీప్రస్తావన అని భావించబడినది. గ్రామీణ జీవిత వ్యవస్థలో వచ్చే విప్లవాత్మకమైన మార్పులు సోషలిస్టు సమాజస్థాపనకు దారితీస్తాయని అంటున్నారు. మంత్రిగారు మిగతా విషయాలతోబాటు ఒక ముఖ్యమైన విషయాన్ని చెప్పారు. ఈ కార్యక్రమాలను అమలుచేయడంలో మనుష్యుల పాత్రనుగురించి, ప్రణాళికను విజయవంతం చేయడానికి వీరు ఏ విధంగా సహకరిస్తున్నారు; దేశభవిష్యత్తు నిర్మాణం చేయడానికై ఏవిధంగా ముందుకు వస్తున్నారు, చొరవతీసుకొని సృజనాత్మకంగా పాటుపడుతున్నారు—అనే విషయాలనుగురించి చెప్పారు. వారి సహాయ సహకారాలను పూర్తిగా పొందడానికి ప్రయత్నం చేయాలని చెప్పారు. అందుకు నేను ప్రత్యేకంగా హర్షిస్తున్నాను. అయితే విమర్శించవలసివచ్చినపుడు ఒక విషయం స్పష్టంగా మనవిచేయకతప్పదు. దేశవ్యాప్తంగా సాగుతున్న పద్ధతులను విచారిస్తే, ఏ మూలసిద్ధాంతాన్ని దృష్టిలోపెట్టుకొని సమాజ వికాసాన్ని, శాస్త్ర వికా

సాన్ని గ్రామసీమలకు వ్యాపింపచేయాలనుకుంటున్నామో, కాంగ్రెసు అనుసరిస్తున్న విధానాలవల్ల ఆ మూలసిద్ధాంతమే వమ్ము అవుతున్నది, దానికే భంగం కలుగుతున్నదని చెప్పకతప్పదు. నా నియోజకవర్గం రెండు బ్లాకులుగా విభజించబడినది. జిల్లా ప్లానింగు కమిటీవారు కొన్ని సంవత్సరాలుగా పని చేస్తున్నారు. కొన్ని సంవత్సరాలైనతరువాత, N. E. S. నుంచి C. D స్థాయికి వచ్చినతరువాత జిల్లా ప్లానింగు కమిటీలో జరుగుతున్న చర్చలు చూస్తే శాసన సభ్యులు ఆశ్చర్యపడక తప్పదు. కరీమ్‌నగర్ జిల్లా ప్లానింగు కమిటీలో మూడుసమావేశాల తరబడి ఒక విషయం చర్చకు వస్తున్నది. ఆ చర్చకు అంతం లేకుండా పోతున్నది. పచ్చి ఎరువును (green manure) తయారుచేయటం గురించి రైతులకు తెలియజెప్పడానికి బ్లాకు ప్రాంతంలో కనీసం మూడు గ్రామాలలో B. D. O. తయారుచేసి చూపిస్తే బాగుంటుందని జిల్లా ప్లానింగ్ కమిటీ ఒక సూచన చేసినది. అయితే దానినింతవరకు ఆచరణలో పెట్టలేక పోయినారు. జిల్లా ప్లానింగ్ కమిటీలో ప్రతిసారి విమర్శ చేస్తున్నప్పటికి పచ్చి ఎరువు తయారు చేయడానికి భూమి దొరకడం లేదని B. D. O. వాదిస్తున్నారు. B. D. Os, వారిక్రింద ఉద్యోగస్థులు, గ్రామసేవకులు - ఇంత పెద్ద సిబ్బంది ఉండి కార్యక్రమం అంటూ ఇంత హడావుడి చేస్తుంటేకూడా ఒక చిన్న కార్యక్రమాన్ని విజయవంతంగాచేసి చూపించడానికి సాధ్యం కావడం లేదు. ప్రజా సహకారం విషయమై జిల్లా స్థాయిలోను, రాష్ట్ర స్థాయిలోను, అఖిలభారత మహా సభలలోను ఆలోచించిననాడు నేటి కార్యక్రమాలు ప్రజలకెంత సన్నిహితంగా లేకుండా వున్నవో అర్థం చేసుకోవడానికి పరిష్కారమార్గాలను యోచించడానికి ఉపయోగపడుతుంది. ఎలగందల అనేగ్రామం ఉన్నది. అక్కడ హరిజనులు ఇండ్ల స్థలాలు కావాలని చాలా కాలంనుంచి పోరాడుతున్నారు. ప్రభుత్వ కార్యకర్తలు కాని, రాజకీయ పార్టీ కార్యకర్తలు కాని ఆ గ్రామం వెడితే ప్రజలు అడిగేది ఇండ్లు, B. D. O. ఆ గ్రామం వెళ్ళి ఆ సమస్యా పరిష్కారానికి ప్రయత్నం చేయకుండా పిల్లలకు ఒక పార్కు కట్టాలని ప్రణాళిక వేసినారు. దానికై 300 రూపాయిలు కేటాయించినారు. హరిజనులకు ఉన్న సమస్య ఏమిటి; పిల్లలకు పార్కుఏమిటి; అనే ఆలోచనే వారికిలేకుండా పోయినది. ఏదోవిధంగా గ్రామంలో ఒక మట్టిరోడ్డు వేస్తే, దానికి culvert కట్టడానికి ప్లానింగు శాఖవారు వెళ్ళి దానిని సర్వే చేయించవలసినదని రిపోర్టు పంపితే ఇంతవరకు సర్వే కాలేదు. నాలుగైదుసార్లు reminders ఇచ్చినా ఇంతవరకు ఏమీ జరుగలేదు. విషయాలన్నీ విచారించినమీదట ఈ కార్యక్రమం వెనుకఉన్న తత్వం (philosophy) ఆశయాలు, ఆదర్శాలు ఇపుడు అనుసరిస్తున్న విధానాల వల్ల సఫలం కావడంలేదని చెప్పకతప్పదు. B. D. Os, గ్రామసేవకులు గ్రామాలకు వెడుతున్నారు, రైతులు మంచి విత్తనాలు వేసుకోవాలని, చెరువులు

మరమ్మత్తులు కావాలని ఏవో కార్యక్రమాలు చెబుతుంటారు. కాని ఆచరణలోనికి వచ్చుసరికి రైతులకు, పేద ప్రజలకు ఉపయోగించే పనులు చేయకుండా వచ్చిన డబ్బును దుబారా చేసేవారు, డబ్బును కాజేసే స్వార్థపరులు ఉంటున్నారు. గ్రామాలలోవున్న పశేలు పట్వారీ వ్యవస్థ ప్లానింగ్ మంత్రిగారికి తెలియనిసంగతికాదు. రైతుల సాంఘికజీవితం అభివృద్ధి కానీయకుండా, సహకారం అభివృద్ధి కానీయకుండా, సృజనాత్మకమైన కృషిని ముందుకు రానీయకుండా, భూస్వాములు, పెత్తనదారులు గ్రామాలలో రాజ్యంచేస్తుంటే ఇదేమీ ప్రణాళిక శాఖకు సంబంధించిన విషయంకాదా? కళా వెంకటరావుగారికేకాని వి. బి. రాజు గారికి సంబంధించిన విషయంకాదా? ప్రణాళిక అంటే ఒక డిపార్టుమెంటు మాత్రమేనా? కొన్ని సంవత్సరాలలో కొన్ని వేలమంది నిరుద్యోగులకు ఉద్యోగం కల్పించడం మాత్రమేనా? అయితే అది సాధ్యంకావచ్చును. కాని ప్రణాళికలలోని మూలసిద్ధాంతం ఏ ఇరవైఐదుపాళ్లలో ఐదుపాళ్లుకూడా నెరవేరదని ప్రభుత్వాన్ని హెచ్చరించకతప్పదు. చేయదలచుకుంటే ప్రభుత్వమే బాధ్యత వహించి అన్ని రాజకీయపక్షాల విశ్వాసం చూరగొని, అందరితో కలిసి కూర్చుని ఇంతగా డబ్బుఖర్చుచేసినా నిజమైన వికాసం కలుగుటలేదు; దానికి కారణమేమి? పరిష్కార మార్గములేమి? అని ఆలోచించవలె. ప్రస్తుతం ప్రజలలో **crisis of confidence** ఉన్నది. ప్రభుత్వంపైన, ప్రభుత్వ సిబ్బందిపైన ప్రభుత్వ ప్రతినిధులుగా గ్రామాలలో వ్యవహరించే వారిపైన జనసామాన్యానికి విశ్వాసం లేదు. ఈ విషయం సర్వత్రా అంగీకరించినదే. జిల్లాలలో ఏ డిపార్టుమెంటుపనికై వెళ్ళినా లంచాలు తీసుకుంటారని అందరికి తెలుసును. N. E. S బ్లాకులో స్కూలు కట్టిస్తే కంట్రాక్టరుకు డబ్బురావాలంటే అందులో 25% ముడుపు చెల్లించుకోవలసినదే. లేకపోతే డబ్బురాదు. ఇన్ని అవస్థలు అనర్థకాలు సాంఘిక జీవితంలో ఉన్నాయి. భూస్వామ్య పద్ధతిని సంస్కరించి 4,500 రూపాయలు ఆదాయం భూమిని గరిష్ఠ ప్రమాణంగా పెట్టాలని ఒకప్రక్క చెబుతూ 10,000 రూపాయలు ఆదాయం వచ్చేవారిని మరొకప్రక్క కాపాడుతూఉంటే...

మిస్టర్ స్పీకర్ : భూసంస్కరణలమాట వద్దు.

శ్రీ సి.హెచ్. రాజేశ్వరరావు : ప్రణాళికలకు భూసంస్కరణలకుకూడా సంబంధం ఉన్నది.

మిస్టర్ స్పీకర్ : అయితే ప్రపంచంలో అన్నింటికి సంబంధం ఉంటుంది.

శ్రీ సి.హెచ్. రాజేశ్వరరావు : ఈనాడున్న పరిస్థితులలో గ్రామములలో పని సరిగా జరుగుటలేదు. విలేజి లెవెలు వర్కర్సు జీతాలు మొట్టమొదట కొద్ది ఎక్కువగా వున్నా, ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడిన తరువాత అవి

తగ్గిపోయినవి. జీతభత్యాలన్నీ కలుపుకొని నెలకు 75 రూపాయలు మించి దొరకడంలేదు. ఈ ఉద్యోగులు గ్రామాలకు వెళ్ళి రైతులతో కలిసి మెలసి పనిచేయడం ఇట్టి పరిస్థితులలో సాధ్యం కావడంలేదు. జీతాలు సరిపోక భార్యాబిడ్డలను పోషించుకోలేని పరిస్థితులలో వారు ఉద్యోగం చేయవలసి వస్తున్నది. ఈ నాడు విలేజి లెవెలు వర్కర్సుకు కేటాయించిన పని కొంత వరకు ఉద్యోగేతరులచేత చేయించవచ్చును. గ్రామ ప్రాంతాలలో మెట్రిక్యులేషను, బి. ఎ. ల వరకు చదువుకున్న విద్యావంతులెంతమందో ఉన్నారు. అట్టివారిని పార్ట్‌టైము వర్కర్సుగా ఏర్పాటు చేసినట్లయిన వారు తమ వ్యవసాయ పనులను చూచుకుంటూ ఇతర రైతులకు ఎన్నో విషయాలు తెలియచేయుటకు ఎక్కువ అవకాశముంటుంది. ఇట్టివారికి నెలకు 40 లేక 50 రూపాయ లిచ్చినప్పటికీ మనకు ఖర్చు తక్కువవుతుంది. అంతే కాకుండా ప్రజలతో నిత్యం సంబంధం ఉన్నవారు కావడంచేత రైతులకు నమ్మిక, ఉత్సాహం కలిగి అధికాహారోత్పత్తి చేయడానికి ఎక్కువ అవకాశాలుంటాయి. ముఖ్యమంత్రిగారు సమాజ వికాస కార్యక్రమము జయప్రదంగా కొనసాగాలంటే ప్రజా సహకారం కావాలన్నారు. నేను చెప్పిన పద్ధతివల్ల ప్రజా సహకారం ఎక్కువగా లభ్యమవుతుంది. బ్లాకు కమిటీలు ఏర్పాటుచేయు సందర్భంలో స్థానికంగా ఉండే శాసన సభ్యులనే కాకుండా ఇతరత్రా కొంత మందిని కూడా వేస్తున్నారు. ఇట్టి నామినేషనుల విషయంలో కొంత పాక్షిక భావం వహిస్తున్నట్లు కనపడుతున్నది. కాంగ్రెసుకు సంబంధించిన వారిని ఈ కమిటీలకు నామినేటు చేయడం జరుగుతున్నది. దీనిని ఒక పార్టీ సమస్యగా కాకుండా యావత్ప్రజానీకానికి సంబంధించిన సమస్యగా తీసుకోవాలి. ప్రతి పక్షానికి చెందినవా రయినను ప్రజలతో కలసి మెలసి పనిచేయగల వారిని తీసుకున్నట్లయితే పని సక్రమంగా జరుగుతుందని మనవి చేస్తున్నాను. ఈ విషయం మీద మాట్లాడుతూ మంత్రిగారు ఇదేదో రిలెటివ్ టరన్ అన్నారు. అటువంటి నిర్వచనాలవల్ల ప్రయోజనం లేదు. "Relative" లేక "Absolute" అనే వివాదాలలోకి మనం పోయినట్లయితే తుదకు మిగిలేది మిథ్యావాదమే. ఆ మిథ్యాతత్వానికి దోహదమీయని రీతిగా సామూజిక ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకుని బ్లాక్ కమిటీలను ఏర్పాటు చేసినట్లయితే ఈ కార్యక్రమము సమర్థంగా సాగుతుందని తెలియజేస్తున్నాను. నేను చేసిన సూచనలను దృష్టిలో ఉంచుకొని ఈ శాఖను పునర్నిర్మించవలెనని కోరుచున్నాను.

*శ్రీ యస్. కె. వి. కృష్ణావతారం (తాడేపల్లిగూడెం - జనరల్) : ప్లానింగు మంత్రిగారు ప్రవేశపెట్టిన డిమాండును బలపరుస్తున్నాను. ప్లానింగు మంత్రిగారు వారి శాఖపద్దునుగురించి చాలవివరంగా చెప్పారు. జాతీయ విస్తరణ కేంద్రాలు, సమాజ అభ్యుదయ కేంద్రాలు ఏవిధంగా పనిచేయుచున్న వారు తెలియ

జేశారు. ఈ ప్రణాళికలలో రాబోయే మార్పులను గురించి చాల విపులంగా తెలియజేసినందుకు వారిని ప్రశంసిస్తున్నాను. ఈ కార్యక్రమములను మనం జాతీయసమస్యగా పరిగణించవలసియున్నది. ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక, వైజ్ఞానిక రంగాలలో అభ్యుదయం సాధించుటకు అమలుజరుపబడుతున్న కార్యక్రమము యొక్క ఫలితములు గమనించకుండా కేవలం విమర్శకొరకే కొందరు ప్రభుత్వ విధానాలను విమర్శించడం సమంజసం కాదు. మనదేశ అభ్యుదయమంతా ఈ కార్యక్రమంపైననే ఆశించి ఉన్నది. దీనిని ఒక జాతీయ ఉద్యమంగా భావించి అన్ని పక్షములవారు బలపరచవలసిన అవసరమున్నదని మనవిచేస్తున్నాను,

అధికాహారోత్పత్తి సాధించేనిమిత్తం Development Commissioners' Conference లో కొన్ని సూచనలు చేయబడ్డాయి. భారతదేశం ముఖ్యంగా వ్యవసాయిక దేశమయినప్పటికీ వ్యవసాయోత్పత్తిలో లోటుండడము చాలా విచారకరం. ద్వితీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో వ్యవసాయోత్పత్తి కనీసం 50 శాతమయినను ఎక్కువకావలసిఉన్నది. ఇందుకు అన్నివిధముల రాష్ట్రప్రభుత్వాలు కృషిచేయాలని వారు సూచించారు. ఐతే వారి సూచన ఎంతవరకు పాటించబడుతున్నది అనేది సందేహాస్పదమయిన విషయం. ఆ సూచనలు ఇంప్లిమెంటుచేయడంలేదు. మన ప్రధాని శ్రీ నెహ్రూగారు భారత ప్రభుత్వ మంత్రి శ్రీ యస్. కె. డే. గారు అధికాహారోత్పత్తికి ప్రజలందరు కృషిచేయాలని పదే పదే చెబుతున్నారు. కాని ఆహారోత్పత్తిలో అనుకున్నంత పెరుగుదల కనిపించుటలేదు. ఈ లోటుకు బాధ్యులు ఒక అధికారులే కాదని నా అభిప్రాయం. అగ్రికల్చురలు లోన్సు మంజూరుచేయు సందర్భంలో ప్రతి రైతు మరిద్దరు స్యూరిటీలను సంపాదించవలసి వస్తున్నది. వీరందరూకూడ సాల్వెన్సీ సర్టిఫికేటు దాఖలు చేయవలసివస్తున్నది. ఇందువల్ల రైతులకు అగ్రికల్చురల్ లోన్సు త్వరగా రావడంలేదు. ఈ సర్టిఫికేట్లు సంపాదించవలసిన అవసరమున్నది కనుక దరఖాస్తులు మంజూరుకావడానికి నెలలతరబడి ఆలస్యమగుతున్నది. ఇట్టి సర్టిఫికేట్లను రిజస్టరుచేయించవలసివస్తున్నందున రైతుకుకొంత డబ్బు ఖర్చవుతున్నది. ఇటువంటి ఖర్చులులేకుండా డిస్ట్రిక్టురిజస్ట్రారుగాని, సబురిజస్ట్రారుగాని ఉచితంగా ఈ సర్టిఫికేట్లను సప్లయి చేసినట్లయితే రైతుకు నష్టంలేకుండా ఉంటుంది అగ్రికల్చరల్ లోన్సు మంజూరు విషయంలో యింకా కొన్ని అడ్డంకులున్నాయి. ముఖ్యంగా జాయింటు పట్టాలసమస్య ఒక పెద్ద అడ్డంకుగా ఉన్నది. జిల్లాప్లానింగుకమిటీ సమావేశములలోను, బ్లాకు డెవలప్మెంటు కమిటీ సమావేశాలలోను దీన్నిగురించి చర్చించి అధికారులకు మా సూచనలు తెలియచేశాము. ఐనప్పటికీ ఇది ఇంకా అపరిష్కృతంగా ఉంది. రైతులకు సకాలంలో ఈ అప్పులు మంజూరయితేగాని అధికాహారోత్పత్తి

సాధించడం కష్టం. అగ్రికల్చరల్ లోన్సు ఇరిగేషను లోన్సు మొదలైనవి. వెంటనే మంజూరయేట్లు చూడవలసినదని ఇప్పుడున్న అడ్డంకులను తొలగించ వలెనని కోరుతున్నాను.

మైనర్ ఇరిగేషన్ వర్క్సుకు గవర్నమెంటు కంట్రిబ్యూషన్ 66% వరకూ ఇస్తామన్నారు. రైతులు 33% ఇవ్వాల్సి ఉన్నది. కాని యీ విషయంలోమాత్రం, బ్లాక్ డెవలప్ మెంట్ అధికారులు ఎట్టి శ్రద్ధ తీసుకొనుటలేదని చెబుతున్నాను. మైనర్ ఇరిగేషన్ వర్క్సు చెరువుల మరమ్మతులు చేసే విషయాలలో ఎవరు ఎస్టిమేట్సు తయారుచేయాలి, ఎవరు బాధ్యత తీసుకోవాలి, బ్లాక్ డెవలప్ మెంట్ సూపరువైజరు చేయడానికి అధికారం ఉన్నదా, లేకపోతే పి. డబ్ల్యు. డి. వారు చేయాలా లేక మైనర్ ఇరిగేషన్ డిపార్టుమెంటువారు చేయాలా, తెలియుటలేదు. అటువంటి ఆటంకాలు చాలా ఉన్నాయి, చాలాచోట్ల పంచాయతీ బోర్డు అధ్యక్షులుకూడ బాగుగా కోఆపరేట్ చేస్తున్నారు. పంచాయితీ ఆక్టు, **Land Encroachment Act, Land Acquisition Act** — వీటిలో యీ డెవలప్ మెంట్ వర్క్సుకు సంబంధించినంతవరకూ ఏవైతే రెస్ట్రిక్షన్సు ఉన్నాయో వాటిని వెయివ్ చేసి అవనులు చేసే విషయం సమగ్రంగా పరిశీలన చేయాలి.

జపాను కల్టివేషను విషయంలో డెల్టాలలో **Law of diminishing return** అపుడే ఆపరేట్ అవుతోందనీ దానివల్ల ప్రయోజనాలుకూడా లేవని చెబుతున్నారు. ప్రయిమరీ హెల్త్ సెంటర్సులో రెండు జీపులు పెడుతున్నా వాటిని బ్లాక్ డెవలప్ మెంట్ ఆఫీసర్సే ఉపయోగించుకుంటూ, మెడికల్ ఆఫీసర్సుకు ఇవ్వకుండా ఉన్నందున చాలా ఇబ్బందిపడుతున్నారు. దాని విషయము ప్రభుత్వము విచారించాలని కోరుతున్నాను. మెటర్నిటీ సెంటర్సుకు సి డి. బ్లాక్సులోనిగాని యన్.ఇ.యస్. బ్లాక్సులోగాని వేరే ప్రొవిజన్ లేదంటున్నారు. సోషల్ ఎడ్యుకేషన్ విషయంలో అనుభవంగలవారిని నియమించాలి. వేతనము ఎక్కువైనా డిప్యూటి ఇన్ స్పెక్టర్సు ఆఫ్ స్కూల్సు, హెడ్ మిస్ట్రెస్ అటువంటి అనుభవజ్ఞులను వేస్తే ఎక్కువ ప్రయోజనకరంగా ఉంటుంది. మంత్రిగారు చెప్పినట్లు కాలేజీలో పాస్ అయివచ్చిన వెంటనే, వారికి ఉద్యోగాలు ఇవ్వకుండా వారికి ఏ స్కూల్సులోనో, ఇతర రంగాలలోనో ఉద్యోగాలిచ్చి అనుభవముగలవారిని మాత్రమే యీ బ్లాక్సులో నియమించాలని మనవిచేస్తున్నాను.

బ్లాకు సమితులు, జిల్లా సమితులు ఏర్పాటుచేస్తామంటున్నారు. జిల్లా సమితికి కలెక్టరునూ, బ్లాక్ డెవలప్ మెంట్ కౌన్సిల్సుకు ఇంకొక ఉద్యోగిని ఏర్పాటుచేస్తే దానివల్ల ప్రజలలో నిరుత్సాహము కలుగుతుంది. ప్లానింగ్ ఉద్దేశాలు నెరవేరవు. ప్రభుత్వం వేరు, ప్రజలు వేరు అనే అభిప్రాయముపోవాలి.

ప్రజలుకూడా ప్రభుత్వంలో భాగస్వాములుగా పరిగణింపబడినపుడే యీ ప్లానింగ్ కార్యక్రమం జయప్రదంగా కొనసాగుతుంది. జిల్లా ప్లానింగ్ కమిటీను బ్లాక్ డెవలప్‌మెంట్ కౌన్సిల్సుకు అనధికారులను చైర్మన్‌గా వేస్తే బాగుంటుందని మనవిచేస్తున్నాను.

శ్రీ జి. సూర్యనారాయణ: అధ్యక్షా, పెందుర్తి బ్లాకు ఏరియాలో అక్కడి ఉద్యోగస్థులు జరిపించుచున్న కార్యక్రమములకు వారికి మేము ధన్యవాదములు అర్పిస్తున్నాము. అక్కడకు నేను పోయిచూశాను. అక్కడ పనులు చాలా సక్రమంగా జరుగుచున్నవి. ఆ బ్లాకు ఏరియాలో ఉన్న హరిజనులకు చాలా ఉత్సాహంగా అన్ని వృత్తులు కల్పిస్తున్నారు. యీ వృత్తులేకాకుండా కోఆపరేటివ్ సొసైటీ పెట్టి మరికొంతమ్మందికి వృత్తులు కల్పిస్తున్నారు. వర్తక వ్యాపారములున్నవి. దానివల్ల వారు ఆర్థికంగా పైకిరావడానికి అవకాశములున్నవి. కాని మిగతాచోట్ల అంత చురుకుగా పనులు జరుగుటలేదు. మధురవాడ ఫిర్కాకు పోయిచూశాను. అక్కడ పనులు చాల వెనుకబడి ఉన్నాయి. రెండు మూడు సంవత్సరములు కావస్తున్నవి. చంద్రంపేటనుంచి పిలకవాడపాలెంవరకూ రోడ్డు ఏర్పాటుచేశారు. ఈ నాలుగు సంవత్సరములనుంచీ అక్కడ సంపూర్ణంగా మట్టిరోడ్డు వేయలేకపోయినారు. మూడుమైళ్ళ దూరమే ఉన్నది. ఇప్పటికి అయినా ఆ పని జరుగుతున్నదా అంటే లేదు. మధురవాడనుంచి తాడివర్తి అగ్రహారమునకు మట్టిరోడ్డు పోశారు. కాని అది వర్షాలకు కొట్టుకు పోయినది. దానికి ఎస్టిమేటు ఎంతో తెలియదు. అక్కడకుపోయి అడిగితే ఆఫీసరుగారు లేరని, తమకు తెలియదని అన్నారు. ఈ విధంగా ఒకప్రక్క రోడ్డు పోస్తుంటే ఇంకొకప్రక్క కొట్టుకపోతున్నది. ఆ పనులు సక్రమంగా జరుగుతున్నవీ లేనిది మంత్రిగారు తెలుసుకొనవలెనని మనవి చేస్తున్నాను. ఆ పనులు చిరకాలంగా ఉండేటట్లు జరిపించాలని కోరుతున్నాను.

ఇపుడు మొదటి పంచవర్ష ప్రణాళిక పూర్తిఅయి, రెండవ పంచవర్ష ప్రణాళికలోనికి వచ్చినాము. కాని అక్కడ చురుకుగా పనులు జరుగుతున్నట్లు కనపడుటలేదు. విజయనగరం బ్లాకు వెనుకబడిన ప్రాంతం. అక్కడి ప్రజలు విజ్ఞప్తి పంపించారు. నేనుకూడా ప్రశ్నరూపంగా ఆ విషయం ఇక్కడ తీసుకు వచ్చాను. వచ్చే సంవత్సరం చూద్దాము అనేవిధంగా చెప్పారు. విజయనగరం వెనుకబడినప్రాంతం. అక్కడ ఒక బ్లాకు ఏర్పాటుచేసి గ్రామప్రజలకు రాకపోకల సౌకర్యాలు కలిగించాలని కోరుతున్నాను. ఆ తాలూకాలో ఏ గ్రామమునకు పోయిచూచినా మంచినీటికొరత ఉన్నది. అక్కడఉండే స్థానిక ఉద్యోగస్థులకు తహసీల్‌దారుకు, జిల్లాకలెక్టరుకు వ్రాసుకున్నప్పటికి వారు ఒక గ్రామముకూడ పోయిచూడడములేదు. తాలూకా ఉద్యోగస్థులు, జిల్లా ఉద్యో

గస్థులు చాలా నిర్లక్ష్యము చేస్తున్నారు. ప్రజలకు కావలసిన సదుపాయముల కొరకు వ్రాస్తే మరుక్షణమే పోయి పరిశీలించి వారికి కావలసిన సౌకర్యములు కలిగించుటకు మంత్రిగారు తాఖీదు పంపించాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

బ్లాకు ఏరియాలో లేని గ్రామములలో ఉన్న హరిజనుల పరిస్థితి ఏమీ బాగుండలేదు. హరిజనులకు వృత్తులు కల్పిస్తామనీ, సాంఘికంగా, ఆర్థికంగా వారిని పైకి తీసుకువస్తామని అస్పృశ్యతను పోగొడతామనీ చెబుతారే కాని వారి నిజపరిస్థితిచూస్తే చాలా విచారంగా ఉన్నది. పెందుర్తి బ్లాకు ఏరియాలో హరిజనులకు కలిగించిన సౌకర్యములు ఇతర గ్రామములవారికిగూడ కల్పించవలెనని కోరుతున్నాను. వారికి వృత్తులు కల్పించడానికి కోపరేటివ్ సొసైటీలు పెట్టి దీర్ఘకాల ఋణములిచ్చి వర్తకవ్యాపారములూ, చేతివృత్తులూ కల్పించి హరిజనాభివృద్ధికి తోడ్పడవలెనని ప్రభుత్వమునకు విజ్ఞప్తి చేస్తున్నాను. పశువులను మేపడం, కోళ్ళ పెంపకం మొదలయినవి కొన్ని వృత్తులున్నవి. ప్రతి హరిజన కుటుంబమునకు వారు ఆర్థికంగా పైకిరావడానికి 10, 20 సంవత్సరములు దీర్ఘకాల వాయిదాలుపెట్టి ధనసహాయంచేస్తే ఏదో ఒక వృత్తిచేసుకుని పైకిరాగలుగుతారు. హరిజనాభ్యుదయము గురించి మనము మాటలు చెప్పుటకంటె పనులరూపంగా వారికి సహాయముచేయుట అవసరము. వారు ఆర్థికంగా పైకి రాగలిగిననాడు, పరిశుభ్రత వస్తుంది. సంఘంలో వారికి గౌరవమర్యాదలు పెరగటానికి అవకాశము ఉంటుంది. కాబట్టి హరిజనుల విషయమై ప్రత్యేకమైన శ్రద్ధతీసుకొని సాంఘికంగా, ఆర్థికంగా వారిని పైకితీసుకురావడానికి వెంటనే తగు చర్యలు తీసుకొనవలెనని కోరుతున్నాను.

* శ్రీ పి. రాజగోపాలనాయుడు (తవనంపల్లి): అధ్యక్షా, ఈనాడు మంత్రిగారు చెబుతూ "మనకు 447 బ్లాకులు ఉన్నవి; 185 బ్లాకులుమాత్రం ఇప్పటివరకు పెట్టినాము; 262 బ్లాకులు ఇకముందు పెట్టవలసిఉన్నది" అని అన్నారు. ఐదు ఏళ్ళలో వీటిని పెట్టగలమని కూడ చెబుతున్నారు. ఐదు ఏళ్ళలో వీటన్నింటిని పెట్టవలెనంటే, సంవత్సరానికి 52 బ్లాకులు పెట్టవలసిఉంది. కాని మంత్రిగారు చెప్పినదాని ప్రకారం సంవత్సరానికి 30 బ్లాకులు మాత్రమే పెట్టేటట్లు కనబడుతున్నది. ఆ విధంగా ఆలోచిస్తే, ఈ బ్లాకులన్నీ పెట్టటానికి తొమ్మిది ఏళ్ళు పడుతుంది. ఐదు ఏళ్ళలో ఈ బ్లాకులన్నీ పెట్టినప్పటికీ, బ్లాకులు పెట్టని ప్రాంతాల విషయంకూడ మనం ఆలోచించాలి. లోకల్ డెవలప్‌మెంట్ వర్క్సు ఇంతవరకు ఇస్తూ ఉండినారు. 1958-59 సంవత్సరం వరకే అవి ఉండబోతున్నవి. మనం ఈ ప్రణాళికలను మారుస్తున్నప్పుడు, ఈ బ్లాకులు పెట్టుటకు కాలపరిమితి పొడిగించినపుడు, తప్పనిసరిగా, కనీసం రెండవ పంచవర్ష ప్రణాళిక పూర్తి అయ్యేవరకైనా, లోకల్ డెవలప్‌మెంట్ వర్క్సు

స్కీమ్సుక్రింద డబ్బు యిస్తే, బ్లాకులు పెట్టని ప్రాంతాలలో కొంత అభివృద్ధి కలుగ జేయటానికి అవకాశం కలుగుతుంది. ఆ విధంగా ఆ ప్రాంతాలవారిని సంతృప్తి కలిగించేదానికి వీలుకలుగుతుంది; కాబట్టి, రెండవ పంచవర్ష ప్రణాళిక పూర్తి అయ్యేంతవరకు లోకల్ డెవలప్‌మెంట్ వర్క్స్ స్కీమ్సుక్రింద డబ్బు ఇవ్వాలని కోరుతున్నాను. ఈ బ్లాకుల స్వరూపం మారుస్తూ ఉన్నారు. అది చాలా సంతోషకరమైన విషయము. బ్లాక్‌ను ఎడ్మినిస్ట్రేటివ్ యూనిట్‌గా ఉంచబోతున్నారని చెబుతున్నారు. అలా ఉంచబోతున్న దానియొక్క హెడ్ క్వార్టర్స్ నిర్ణయించే విషయంలో జాగ్రత్త తీసుకోవాలి. ఎక్కడో ఒకమూల దాని కేంద్రస్థానం పెడితే, ప్రజలు అక్కడకు వెళ్ళటానికి కష్టంగా ఉంటుంది. కనుక మధ్య ప్రాంతంలో దానియొక్క కేంద్రం పెట్టేటట్లు చూడవలసి ఉన్నది.

ఈ నాడు విలేజి లెవెల్ వర్కర్సు పనిచేస్తున్న ప్రాంతంలో చాలా పంచాయితీలు ఉన్నవి. అందువల్ల అవి సౌష్ఠవంగా లేవు. రేపు, పంచాయితీ అధ్యక్షుల ద్వారా బ్లాక్ కౌన్సిల్ ఏర్పాటు చేయాలని మనం అనుకొంటున్నాము. రాయలసీమ మొదలైన ప్రాంతాల్లో సుమారు 40, 50 పంచాయితీలు ఉండటం జరుగుతుంది. సర్కార్ ప్రాంతంలో 20, 30 పంచాయితీలు ఉండటం జరుగుతుంది. అలా కాకుండా, ఈ విలేజ్ లెవెల్ వర్కర్ పనిచేస్తున్న ప్రాంతానికంతా ఒక పంచాయితీ ఉన్నట్లయితే తప్పనిసరిగా ఒక బ్లాక్ కౌన్సిల్‌లో పదిమంది పంచాయితీ అధ్యక్షులు ఉండి, సక్రమంగా చర్చలు చేసేదానికి వీలుంటుంది. అది యూనిఫారంగా కూడ ఉంటుంది. ఆ విధంగా చేస్తే, ఆరువేలమందికి ఒక పంచాయితీ ఏర్పాటు చేసేదానికి వీలుంటుంది కాబట్టి, ఆ ప్రాంతంలో ఒక పంచాయితీ ఏర్పాటు చేయాలని కోరుతున్నాను.

కో-ఆపరేటివ్ సొసైటీలు పెట్టే విషయంలోకూడ ఇప్పుడు ఒక చిక్కు ఉన్నది. 'పరిమితిలేని పూచీ' ఉండటంవల్ల ఎవరినంటేవారిని చేర్చేదానికి, అధ్యక్ష కార్యదర్శులుగా ఉండేవారు అంగీకరించటం లేదు. కాబట్టి, ఎక్కువ ప్రాంతాలలో యీ కో-ఆపరేటివ్ సొసైటీలు పెట్టినప్పటికి కవరేజ్ ఆఫ్ పాపులేషన్ చాలా తక్కువగా ఉంటున్నది. కాబట్టి 'పరిమిత పూచీ' ఉన్నట్లయితే చాలా లాభంగా ఉంటుంది. లార్జ్ స్కేల్ సొసైటీలు ప్రత్యేకంగా ఫారమ్‌చేస్తే చాలా సులభంగా ఉంటుంది. అందుచేత విలేజ్ లెవెల్ వర్కర్ పనిచేస్తున్న ప్రాంతంలో ఒక లార్జ్ స్కేల్ సొసైటీ పెడితే బాగుంటుంది. ఈ 'పరిమితి కలిగిన పూచీ' కలిగిన లార్జ్ స్కేల్ సొసైటీ ఏర్పాటుచేస్తే, దానిద్వారా అందరికి అప్పులు ఇచ్చే అవకాశం కలిగించటానికి వీలుంటుంది. కనుక ఇకమీదట, మనం ఏర్పాటు చేయబోయే బ్లాక్సులో ఇలాంటి మార్పులు తీసుకురావాలని కోరుతున్నాను.

ఇప్పుడు ఉన్న ఉద్యోగస్థుల విషయం మనం ఆలోచించాలి. ఇప్పుడు ఉన్న సోషల్ ఎడ్యుకేషన్ ఆర్గనైజర్స్ విషయంలో ఇంత విమర్శ రావటానికి కారణం ఏమిటంటే, వారికి వెల్‌డిఫైన్డ్ ఫంక్షన్స్ అన్నవి లేకుండా ఉన్నాయి. కాబట్టి వారి ఫంక్షన్స్ డిఫైన్ చేసినట్లయితే చాలా బాగుంటుంది. ఒక బిల్డింగ్ కడితే, అది మన కళ్ళకు కనబడుతుంది అందువల్ల ఓవర్‌సీర్ ఏమి పనిచేస్తున్నాడో తెలుస్తుంది. కాని సోషల్ ఎడ్యుకేషన్ ఆర్గనైజర్ చేయవలసిన పని "ప్రచారం" కనుక వారికి వెల్‌డిఫైన్డ్ ఫంక్షన్ లేకపోతే వారు ఏమి పని చేశారో తెలియదు. కాబట్టి వాళ్ళకు ఫంక్షన్స్ డిఫైన్ చేయాలని కోరుతున్నాను.

డూప్లికేషన్ ఆఫ్ ఆఫీషియల్స్ ఉన్నట్లు తెలుస్తోంది. ఈ posts అన్నింటిని మెర్జ్ చేయవలసిఉంది. బ్లాక్ కౌన్సిల్స్‌లో బి. డి. ఒ. ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా ఉండవలసిందేగాని, వారిక్రింద యీ సలహాసంఘాలు ఉండటం మంచిది కాదు. పంచాయితీ అధ్యక్షులు ఒక చైర్‌మన్‌ను ఎన్నుకొని, ఆ చైర్‌మన్ క్రింద బి.డి.ఒ. పనిచేయాలి. బి. డి. ఒ. ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా పనిచేయాలి. అప్పుడు అది ఒక మీనియేచర్ అసెంబ్లీవలె ఉండి, ప్రజలందరూ బాధ్యత వహించేదానికి వీలుంటుంది కాబట్టి, ఇలాంటి మార్పులు చేసి బ్లాకుల స్వరూపం దిద్దాలని, వాటిని ప్రజాస్వామికం చేయాలని కోరుతున్నాను.

*శ్రీ వి. విశ్వేశ్వరరావు: అధ్యక్షా, నేను ముందే యీ డిమాండ్లపైన కొన్ని కోత తీర్మానాలు ఇచ్చాను. ఆ కోత తీర్మానాలు దృష్టిలో పెట్టుకొని మంత్రిగారు సమాధానం ఇస్తారని ఆశించాను. వాటి విషయంలో మంత్రిగారు ఏమీ చెప్పకపోవటంవల్ల, నేను నా కోత తీర్మానాలను ప్రతిపాదించవలసివచ్చింది. "ఈ ప్రణాళికలు జయప్రదం కావాలంటే ప్రజలయొక్క సహకారం కావాలి" అని మంత్రిగారు చెప్పారు. ప్రజల సహకారం కావలసిందే. ఈ ప్రణాళిక అమలు జరపటంలో, యీ కార్యక్రమాలు నిర్వహించటంలో ప్రజల పాత్ర చాలా ఎక్కువగా ఉన్నది. తమ గ్రామం బాగుచేసుకోవటం, స్కూల్స్ ఏర్పాటుచేసుకోవటం, రోడ్లు వేసుకోవటం— ఈ కార్యక్రమమంతా తమదేనని ప్రజలు భావించి, చొరవగా పనిచేసినప్పుడే, ఆ కార్యక్రమం జయప్రదం అవటానికి అవకాశం ఉంది. కాని ప్రభుత్వం ఏ దశలోనైనా, ప్రజలయొక్క సహకారం తీసుకోవటానికి ప్రయత్నం చేస్తోందాఅంటే, దానికి సమాధానం రావటంలేదు. ప్రభుత్వం ఎవరి సహకారం తీసుకొంటున్నది? ప్రభుత్వం తన అనుచరుల, మిత్రుల సహకారం తీసుకొంటోందిగాని, దేశంలోని ప్రజానీకం సహకారం తీసుకోవటంలేదు.

ఒక విషయం నేను ముఖ్యంగా మంత్రిగారికి చెప్పదలచుకొన్నాను. నల్లగొండలో ఉన్నటువంటి మెడికల్ యూనిట్ మొబైల్ వేన్ సెంటర్ చౌటుప్పలలో ఎందుకు పెట్టవలసి వచ్చింది అని అడుగుతున్నాను. చౌటుప్పల హైదరాబాదుకు 25 మైళ్ళ దూరంలో ఉంది. అది మెయిన్ రోడ్డుమీద ఉంది. అది జిల్లా హెడ్ క్వార్టర్స్‌లో పెడితే, జిల్లాలో ఉన్న ప్రాంతాలకు వెళ్ళటానికి అవకాశం ఉంటుంది. అక్కడకు జిల్లాలోని నలుమూలలనుండి ప్రజలు రావటానికి సౌకర్యంగాఉంటుంది. అటువంటిదానిని తీసుకువచ్చి చౌటుప్పలలో ఎందుకు పెట్టాల్సివచ్చిందని అడుగుతున్నాను. కేవలం వారి పార్టీ యొక్క శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని అక్కడ పెట్టారా అని నేను మంత్రిగారిని ప్రశ్నిస్తున్నాను.

బ్లాక్ కమిటీలు ఏర్పాటు చేస్తున్నారు. ఈనాడు దేశంలో ప్రతిపక్షాలు ఉన్నట్లు మనకు తెలుసు. ఈ శాసనసభలో ప్రతిపక్షాలు ఉన్నాయన్న సంగతి అందరికీ తెలుసు. ఆంధ్రలో ఎలక్షన్స్ జరిగిన సందర్భంలో నూటికి 33 ఓట్లు కమ్యూనిస్టుపార్టీకి వచ్చాయి. అదేవిధంగా సోషలిస్టుపార్టీకి కూడా వచ్చాయి. మంత్రిగారు ఇన్ని బ్లాక్స్ ఏర్పాటుచేశామన్నారు. ఏ ఒక్క బ్లాకులో అయినా సరే కాంగ్రెసువారు కానటువంటివారు ఉన్నారా, అని నేను ప్రశ్నిస్తున్నాను. మంత్రిగారి దగ్గర లెక్కలు ఉంటే చెప్పండని కోరుతున్నాను. కృష్ణా జిల్లాలో ఎనిమిది బ్లాకులు ఉన్నాయి. ఈ ఎనిమిది బ్లాకులలో ఏ ఒక్క బ్లాకులో అయినా సరే— శాసన సభ్యులుగా ఉన్న మేము ముగ్గురము కాక— ప్రతిపక్షాలనుండి ఒక్కరినైనా తీసుకొన్నారా అని నేను ప్రశ్నిస్తున్నాను. మైలవరం బ్లాకులో నేను ఉన్నాను. మైలవరం నియోజకవర్గంనుండి నేను ఎన్నుకోబడ్డాను. మైలవరం బ్లాకులో ఎవరైనా పంచాయితీ బోర్డు ప్రసిడెంటుగా ఉండి ఉంటే తప్ప, ప్రభుత్వం నామినేషన్ చేసినవారిలో ప్రతిపక్షంవారు ఒక్కరు కూడా లేరని చెబుతున్నాను. అదేవిధంగా తిరువూరు, వీరవరం బ్లాక్సులో ఎవరిని ప్రతిపక్షంవారిని వేయకపోవటం జరిగింది. గన్నవరం బ్లాకులో ఏదో, ఒకరు మాత్రం ఉన్నారు. ఈ మధ్యనే తీసుకొన్న అగ్గనైజేషన్ బ్లాకులున్నవి. ఇందులో ప్రతిపక్షంవారిని ఒక్కర్ని కూడ తీసుకోలేదని నేను ఘంటాపథంగా చెప్పగలను. ఒక్క కాంగ్రెస్‌వారితో బ్లాక్స్ నింపటం కాకుండా ప్రతిపక్షం నుండి, ఇతర ప్రజానీకంనుండి ఎందుకుతీసుకోరని నేను ప్రశ్నిస్తున్నాను. కాబట్టి ప్రభుత్వం ప్రజల సహాకారం కాదు తీసుకొంటున్నది. వారు వారియొక్క కాంగ్రెసుపార్టీ సహాకారం మాత్రమే తీసుకొంటున్నారు. గ్రామాలలో ఉన్నటువంటి కొద్దిమంది సహాకారం మాత్రమే తీసుకొంటున్నారు. అందువల్ల యీ పని జయప్రదం కావటంలేదు.

తరువాత మరొక విషయమును మంత్రిగారిదృష్టికి తెస్తున్నాను. బ్లాకులలో G. M. F. Scheme ను అమలుజరుపలేక పోతున్నారు. బ్లాకులలో స్కీము

ఎంతవరకు అభివృద్ధి చెందుతున్నదిన్నీ మంత్రిగారు పరిశీలించారని అనుకుంటున్నాను. నేను కొన్ని బ్లాకులకు వెళ్ళిచూచాను. అక్కడ యీ స్కీము కుంటుపడి యున్నందుకు విచారకరముగ నున్నది. ఈ స్కీమునుగురించి లెక్కలుమాత్రము కనబడుచున్నవి. లెక్కలు చూపినంత అభివృద్ధి, కృషి యేవిధముగాను ఆచరణలో కన్పించదు. కొత్తగా సాగులోనికి తెచ్చిన భూములు ఎక్కడాకూడ కన్పించవు. ఈ స్కీముకొరకు ప్రభుత్వమువద్దనుంచి అప్పులుమాత్రము తీసుకుంటున్నారు. ఆ అప్పులు యీ స్కీముకొరకు వినియోగిస్తున్నారా అని చూస్తే, అదేమి కన్పించదు. ఈ అప్పులుయిచ్చే సందర్భములో తహశీలుదారు పరిశీలించి సర్టిఫికేటు యిస్తేతప్ప అప్పులు యివ్వకూడదు అని జి. ఓ. పంపినట్లు తెలుస్తున్నది. మామూలుగ **Settlement Officer Certificate** ఇవ్వాలని ఉన్నది. ఆయనకాక, తహశీలుదారుకూడ **Certificate** ఇవ్వాలట. ఇద్దరు విచారించడమువల్ల **duplicity** ఏర్పడుతున్నది. ఈ విధానము సరియైనది కాదని నేను ఇదివరకు యీ సభలో ఎన్నోసార్లు చెప్పాను. తహశీలుదారు వెళ్ళి విచారించాలంటే, **B. D. O.** గారు వుండాలి. **Village Level Worker** ఉండాలి. కరణము మునసబు లెక్కలుఉండాలి. ఇదిఅంతా జరగాలంటే, ఇదివరకు వెంటనే పరిశీలించటానికి, సర్టిఫికేటు యివ్వడానికి కొద్దిగా ఆలస్యము అయితే, యిప్పుడు ఆరు నెలలు, సంవత్సరముకూడ పట్టుతున్నది. తహశీలుదారు పరీక్షచేసి రిపోర్టు పంపినమీదట, **Settlement Officer** యొక్క ఆమోదముద్ర వేయాలట. ఈ కార్యక్రమము అంతా జరగటానికి అయ్యే ఆలస్యమువల్ల భూమి సాగుచేసే రైతు ఎన్నోసార్లు ఆఫీసులచుట్టూ కాళ్ళు అరిగేటట్లు తిరగవలసి వస్తున్నది. అప్పులు రైతులకు సకాలములో అందడములేదు. కాబట్టి యిలాంటి ఆలస్యం కాకుండా, సర్టిఫికేటు వెంటనేయిచ్చి, అప్పులు వెంటనే యివ్వగలిగితేనే, రైతులకు లాభకరము. లేకపోతే, ఇది వృథాప్రయాస అని చెప్పవలసి వస్తున్నది. అప్పులు వెంటనే రైతులకు చేరేటట్లు చేస్తేనే, యీ **G. M. F. Scheme** జయప్రదము కావటానికి అవకాశముంటుంది. అప్పులు సర్వసాధారణముగ అడిగేది పేదప్రజలేగాని, ధనవంతులు అడగరు. ఇంతశ్రమపడరు. భూమిలేనటువంటి పేద ప్రజలే అప్పులకొరకు దరఖాస్తులు పెట్టుకుంటారు. పేదప్రజలు ఎంతోకష్టపడితేనే గాని యీ బంజర్లు సాగులోనికిరావు. ప్రభుత్వోద్యోగస్థులు ఏదోసాకుచెప్పి, ఆ భూములు బంజర్లుఅనో, పోరంబోకులనో, లేక అది గ్రామ అవసరాలకు సంబంధించినదనో, ఏదో ఒక **objection raise** చేసి భూములను సాగుచేయనివ్వక ఆటంకపరుస్తున్నారు. ఇలాంటి **objections raise** చేస్తే, యీ **G. M. F. scheme** ఏవిధముగ ముందుకువస్తుంది? ప్రభుత్వము, ప్రభుత్వోద్యోగస్థులుకూడ రైతులకు తగినంత ప్రోత్సాహము, సహాకారము యిస్తేగాని, యిది ముందుకురాదు. గ్రామాలలోని ధనవంతులు, పలుకుబడిగలవారు అధికార్లను చేబట్టి యీ

బంజర్లు యివ్వటానికి వీలుకాకుండ చేస్తున్నారు. అధికారులుకూడ వాళ్ళ యొక్క influence కు లోబడి భూములను సాగుచెయ్యనివ్వడములేదు. ఎక్కడైనా ఏదో ఒక భూమి ఆక్రమించి యీ స్కీముక్రింద సాగుచేస్తూ ఉంటే, అప్పుడు ఏ పలుకుబడిగల భూస్వామో పిటిషను పెట్టితే, అధికార్లు ఆ రైతును తొలగించటానికి ప్రయత్నిస్తున్నారు. ఆ విషయమునుగురించి ప్రభుత్వానికి తెలియజేస్తే, అప్పుడు ఏ చట్టము అడ్డము వేసో, లేకపోతే ఏ కళా వెంకట్రావుగారో వచ్చి 'యిది మా చట్టమునకు విరుద్ధము, ఇది దురాక్రమణ క్రిందకు వస్తుంది గనుక, రైతును వెళ్ళగొట్టవలసిందే' అని ఆర్డరు ఇస్తారు. ఈరోజులలో అధికోత్పత్తి చేయాలని ప్రభుత్వము ఒక ప్రక్కన చెబుతూ, యిలాంటి ఆర్డర్లు ఇస్తే ప్రయోజనము ఏమిటి? 40% ఉత్పత్తి అధికము చేయాలని అంటున్నారు. సాగుచేయడము ఆరంభించకముందు, B. D. O. గారు అయినా విచారించి దీనికి objection ఏదైనా ఉన్నదా అని చెప్పే అవకాశము ఉన్నది. B. D. O. లకు ప్రభుత్వం జీపులు యిచ్చారు. ఏ ప్రదేశమునకైనను వెంటనే వెళ్ళి విచారించుకుని వచ్చే అవకాశములు ఉన్నవి. తీరా ఆ భూమిలో ప్రవేశించి సగము పనిచేసినతరువాత, దీనికి objection raise చేసి, వెళ్ళగొట్టటము అన్యాయము. అంతవరకు ఆ రైతుచేసిన శ్రమ అంతా వృథాయేనని చెప్పవలసివస్తున్నది. కాబట్టి యీ స్కీము విషయములో కొంత మార్పు తేవడము చాలా అవసరము. మంత్రిగారు ఈ విషయమునుగురించి ఆలోచించి తగినమార్పు తెస్తారని ఆశిస్తున్నాను.

తరువాత Village Leaders Training Camp విషయము ఒకటి ఉన్నది. ఈ క్యాంపులో గ్రామాలలోని వారిని అనేకమందిని తీసుకొనివచ్చి శిక్షణ ఇవ్వడము జరుగుతున్నది. ఇక్కడ ఒక కొత్త పద్ధతి తెచ్చిపెట్టారు. ఈ ట్రయినింగు కొరకు వచ్చేవారు వారియొక్క rations కూడ తెచ్చుకుని తినమని అంటున్నారు. నేను రెండు మూడు training camps కు వెళ్ళి చూచాను. అక్కడ జరిగే ట్రయినింగు సరిగా జరగడములేదు. ట్రయినింగు క్యాంపు పెట్టిన గ్రామాలలోనివాళ్ళు వారికి ఉండే leisure సమయములోనే యీ క్యాంపులో ఇచ్చే ఉపన్యాసాలు వినడము జరుగుతున్నదేకాని, చుట్టుప్రక్కల ఉండే గ్రామాలవారు ఎవ్వరుకూడ వస్తున్నట్లు లేదు. అంటే, యిక్కడవారికి అసౌకర్యముగ ఉండిఉండవచ్చు, లేక ప్రచారము తక్కువ అని చెప్పవచ్చు. ఏమైనప్పటికినీ ఆ training కు తగినంతమంది రావడము లేదు. ప్రక్కన ఉన్న గ్రామాల నుంచి ఇంతదూరము వచ్చినప్పుడు, వారి వారి rations తెచ్చుకొని తినమనడము న్యాయము కాదు. ఈ విధానము సరియైనదిగాదు. తృప్తికరముగా లేదు, దీనిని కొంతమార్పు చేయవలసియున్నది. నేను తిరువూరు

బ్లాకుకుకూడ వెళ్ళియున్నాను. అక్కడనుంచి నేను కొన్ని సూచనలు పంపించాను. వాటిని మంత్రిగారిని పరిశీలించవలసిందిగా కోరుతున్నాను.

శ్రీ రాజా సాగి సూర్యనారాయణరాజు (నర్సీపట్నం - జనరల్) : అధ్యక్షా, గౌరవ సభ్యులు విశ్వేశ్వరరావుగారు చెప్పేది ఆ ఒక్క బ్లాకులోనే ఆవిధముగ జరుగుతున్నదని అంటున్నారా, లేక యితర బ్లాకులలోకూడ అదేమాదిరి జరుగుతున్నదని అంటున్నారా ?

శ్రీ వి. విశ్వేశ్వరరావు : ఈ జి. ఓ. రాష్ట్రము మొత్తానికి వర్తిస్తున్నది. గనుక ఈ బ్లాకులను గురించి నాయొక్క అనుభవమును చెబుతున్నాను. ఇతర బ్లాకులలోకూడ అదేవిధముగ జరుగుతుందని అభిప్రాయముతో ఆవిధముగ చెబుతున్నాను.

తరువాత Local Development Works విషయము ఉన్నది. ఈ బ్లాకులు లేనటువంటిచోట్లలో యీ works అమలులోనికి తేవాలని ప్రజలు కోరుతున్నారు. కాని డబ్బు మాత్రము సకాలములో రావడములేదని సవినయముగ మనవిచేయవలసిన అవసరమున్నది. ఈ సంవత్సరము కృష్ణా జిల్లాలో ఈ works క్రింద రెండు లక్షలో, మూడు లక్షలో ఖర్చు చేయాలని పూనుకున్నారు. కాని అక్కడ జరిగిన విషయమునుగురించి చెబుతున్నాను. ఫిబ్రవరి మాసములో, మావద్ద డబ్బు ఉన్నది తీసుకుని ఖర్చు చేయండి, కాని ఆ డబ్బు 31 వ తేదీలోగా Buildings ను పూర్తిచేసి తీసుకోండి, లేకపోతే యివ్వము అని చెప్పడము జరిగింది. 31 వ తేదీవరకు ఆ బిల్డింగు పూర్తి చేయకుండా ఎందువల్ల ఆలస్యము జరిగింది? ఈ విషయమును గురించి నేను యిదివరకే చెప్పాను. జిల్లా ప్లానింగు కమిటీలోకూడ యీ విషయము గురించి చెప్పాను. ఆనాడు యీ విషయమును గురించికూడ చర్చించాము. ఏమైనప్పటికినీ, ఇలాంటి విలంబనవిధానం అవలంభించడము సరికాదు. ఈ L. D. Works క్రింద ఖర్చుచేసే సొమ్ము సంవత్సరం ఆఖరు నిముషముదాకా ఇవ్వరు. ఆర్థిక సంవత్సరం పూర్తి అయ్యేటప్పుడు స్కూలు బిల్డింగులు త్వరత్వరగా పూర్తి చేయడము అంటే, వాటి సరియైన materials ఉండవు. కట్టడముకూడ సరియైనపరిస్థితిలో ఉండదు. పని అంతా త్వరలో ముగించడము జరుగుతున్నది. ఇలాంటి పద్ధతి కాకుండా సకాలములో డబ్బు అందజేస్తే, ఈ కార్యక్రమములు సరియైన పద్ధతిలో పూర్తి చేయవచ్చు. హడావిడిగా చేయడము మంచిది కాదు. ఒకవేళ ఈ works సంవత్సరము ఆఖరుకు పూర్తి కాకపోయినను, వాటిని spill over warks క్రింద పరిగణించి, మార్చి 31 వ తేదీ దాటిపోయినను అంగీకరించటానికి వీలు గలుగజేయాలని అంటున్నాను. కాకపోతే హడావిడిగా పనులు చేసేటట్లయితే,

తిరిగి వర్షాకాలము రాగానే ఆ buildings అన్నీ పడిపోతాయి. దీనివల్ల ప్రభుత్వానికి నష్టమేతప్ప ప్రయోజనము లేదని హెచ్చరిస్తున్నాను.

మరొక విషయము చెప్పి నా ఉపన్యాసము ముగిస్తాను. బ్లాక్సులో కోళ్ళ పెంపకము జరుపుతున్నారు. వీటితోబాటు పందులను కూడ పెంచు తున్నారు. ఇవి కొన్ని బ్లాకులలో జరుగుతున్నవి. ఇవి కొద్దిమందికి మాత్రమే ఉపయోగపడేటట్లు చేయవద్దని మనవిచేస్తూ సెలవు తీసుకొంటున్నాను.

*శ్రీ వి. బి. రాజు : ఈ దినము నేను ప్రతిపాదించిన ప్లానింగు డిమాండు మీద జరిగిన చర్చవల్ల ప్రభుత్వానికి ఎంతో లాభదాయకముగ నున్నది. గౌరవ సభ్యులు చాలామంది సూచనలు, విమర్శలు చేశారుకాని ఆ విమర్శనల కన్నిం టికి నేను నాకు యీ దినము ఉన్న కొద్ది టైములో సమాధానము చెప్పగలనో లేదోనని అనుకొంటున్నాను. కాని, ప్రయత్నము మాత్రము చేస్తాను గోపాల కృష్ణయ్యగారు మాట్లాడుతూ ప్లానింగు కార్యక్రమముల నిర్వహణలో చాలా జాప్యములు జరుగుతున్నవని అన్నారు. ఈ కార్యక్రమములు ఏలాంటి దృక్ప థముతో జరుగుతున్నప్పటికినీ, అవి లాభం కలుగజేసేది మటుకు ప్రజానీకా నికేనని భావించాలి. ఏ నియోజక వర్గములోనైనా కాంగ్రెసు అని, కమ్యూ నిస్టు అని విభాగములు లేవు. ప్రతి అయిదు సంవత్సరాలకు political shifts ఉంటూనే ఉంటాయి. రాజకీయ దృక్పథముతో ప్రజలకు political గా education యిచ్చి atmosphere create చేసి ప్రజలను ఆకర్షిస్తే ఓట్లు వస్తాయి కాని, రోడ్లకు, చెరువులకు, బావులకు, భూముల పంపకమునకు యీ ఓట్లకు లంకె పెట్టవద్దని మనవి చేస్తున్నాను. ఇది Elections లో నాకు ఉన్న అనుభవమును బట్టి చెబుతున్నాను. కాబట్టి దీనికీ దానికి యేమాత్రము సంబంధము లేదు. ఏ బ్లాకులోనైనా పని ప్రారంభిస్తే దానియొక్క benefits పొందేది అక్కడి ప్రజలేనని అంటున్నాను. ఏ బ్లాకులోనైనా ఆహారోత్పత్తి జరిగితే, అదికూడ అక్కడిప్రజలే అనుభవిస్తారు. కాబట్టి ఇది వేరే దృక్పథముతో జరగడంలేదు. ఏ కార్యక్రమము తలపెట్టినా, అది ప్రజలకొరకేనని గుర్తించమని అంటున్నాను. కాంగ్రెసుపార్టీవారు కోరిన ప్రకారము వినకుండా ప్రతిపక్ష సభ్యులు విమర్శిస్తే కేవలం దానికిలోబడి బ్లాకులు యిస్తే, అది ప్రభుత్వముయొక్క సమర్థత అంటారో, అసమర్థత అంటారో నేనుచెప్పలేను. కాబట్టి అందరిమాటలూ వినాలి. వినినప్పుడు కొన్ని కాంగ్రెసుపార్టీకి వస్తాయి. కొన్ని కమ్యూనిస్టుపార్టీకి వస్తాయి. కొన్ని యితర పార్టీలవారికి వస్తాయి. గనుక అందరికీ నచ్చచెప్పాలి.

కమలాదేవిగారు రెండు విషయములు చెప్పారు. అందులో ఒకటి అబద్ధము, రెండవది నిజము అవునో కాదో నేను చెప్పలేను. మొట్టమొదటిది నల్లగొండలో బ్లాక్సుయిస్తే, చౌటుప్పల్ లో యిచ్చారు అని అన్నది. అక్కడ

నుంచి కాంగ్రెసు సభ్యుడు ఎన్నికై వచ్చాడు. ఇక్కడ కాంగ్రెసువారికి యిచ్చామని అంటే, నక్రీకల్‌లో ఇచ్చాముగదా అక్కడినుంచి కాంగ్రెసు సభ్యుడు రాలేదే? అలాంటప్పుడు దానికి appreciate అయినా చేశారా? అందులో అక్కడ political motive ఉన్నదని అంటారా? అది నిజమేఅయితే కమ్యూనిస్టుపార్టీవారికి పక్షపాతముగ బ్లాకుయిస్తే, దానికేమైనా శ్లాఘించారా? ఆ మాట చెబితే, మాకు కొంత తృప్తికరముగ ఉండేదిగదా. చవుటుప్పల్‌లో Block inauguration కు ప్రచారము జరిగింది. నక్రీకల్‌లో ప్రచారము జరుగలేదు అని అంటున్నారు. నక్రీకల్ ప్రణాళికకు మంత్రిగారు రాలేదని అన్నారు. అవును నన్ను రమ్మని అన్నారు. కాని అదివరకు ఉన్న ప్రోగ్రామునుబట్టి ఆరోజున రావటానికి వీలులేకపోయింది. మరొకతేది నిర్ణయించుకొండి వస్తాను అని ధర్మభిక్షముగారిని కోరాను. వారు ఆ తేది మార్పుకు అనుకూలముగలేరు. ఎలాగైనా ఆ తేదినాటికి కాంగ్రెసుపార్టీకి చెందినవారే మంత్రి నరసింగరావు గారు వచ్చినారు. వారు వచ్చినప్పుడు ఆ విషయం ఆంధ్రప్రదేశ్ మ్యాగ్‌జీన్‌లో పడవలసింది పడలేదు. Photos రాలేదు అని అన్నారు. అయితే అన్నిచోట్లకు రాగలిగినంత సిబ్బంది publicity department లో లేరు. అందువల్ల రాలేదనుకుంటాను. ఒకవేళ ఎక్కడైనా పొరబాటు జరిగిందేమోకాని ఆ విషయము నాకు తెలియదు. అయినను దానిని ఎందువల్ల వేయలేదో నేను విచారిస్తాను. నిజానికి వారు తప్పకుండా వేయవలసిందే. ఎక్కడో ఏదో పొరబాటు జరిగి ఉంటుంది. సహజముగ జరిగేది ఏమిటంటే ఆంధ్రప్రాంతానికి సంబంధించినంత వరకు ప్రతిజిల్లాలోకూడ Publicity Assistant ఉన్నాడు కాని ఆ విధముగ తెలంగాణాలోలేరు. ఇకమీదట appoint చేయాలని అనుకుంటున్నాము. ప్రభుత్వము యీ విషయం అంగీకరించింది. తెలంగాణాలో బహుళ ఆ జిల్లాలో publicity office లేకపోవడమువల్లనే ఇది జరిగిఉంటుంది. అంతకుతప్ప వేరే పొరబాటు జరిగివుండదు. కాని ఒక్క విషయం మాత్రము గౌరవసభ్యులు గుర్తించాలి. ఏ పార్టీకి చెందినవారిని గురించియైనా సరే కమ్యూనిస్టు పార్టీతరఫునగాని కాంగ్రెసుపార్టీ తరఫున గాని యిలాంటి విషయాలలోమటుకు నిష్పక్షపాతముగానే ప్రభుత్వము కార్యక్రమములు జరుపుతూఉంటుంది. గోపాలకృష్ణయ్యగారు మాట్లాడుతూ పెందుర్తి బ్లాకు బాగా పనిచేస్తున్నదని అన్నారు. అది ఎక్కడో extreme end లో ఉన్నది. ఇవతల గద్వాల్ బ్లాకు క్రింద ఉండిపోయింది. వీటిని రెంటిని counterpose చేశారు. పెందుర్తిలో అంతబాగా జరుగుతున్నదని అంటే, నిజముగ ఆ block యొక్క B. D. O. గారి అదృష్టము పండినట్లేనని అనుకుంటాను. పెందుర్తి బ్లాకుకు నేను వెళ్ళివచ్చాను. అక్కడ పనులు బాగానే జరుగుతున్నవి అదేమాదిరిగ ఇతర అన్నిబ్లాకులలోను కార్యక్రమములు జరుగుతున్నవి. గోపాలకృష్ణయ్యగారు ఆ విధముగ

చెబితే బాగాఉండేది. గద్వాల బ్లాకులో పనులు బాగా జరగడములేదని అన్నారు. ఈ విధముగ మాట్లాడితే, ప్రక్కన కూర్చున్న సత్యారెడ్డిగారు గోపాలకృష్ణయ్యగారికి చెప్పి మాట్లాడించారని అనుకోవలసివస్తున్నది. అక్కడ జరిగే పనులను బట్టి, గోపాలకృష్ణయ్యగారు పెందుర్తి బ్లాకుని గురించి ప్రశంసించడము చూస్తే వారు అక్కడికిపోయి చూచివచ్చి, చెప్పిన విషయముగ కనబడదు. వారు ఆ బ్లాకును చూడనేలేదని స్పష్టమగుచున్నది. బ్లాకును చూడకుండా చెప్పారు అని అనుకోవలసిందే. గద్వాల బ్లాకును మొన్ననే ప్రారంభించాము. అక్కడ పనులు మొదలుపెట్టి రెండునెలలే అయింది. ఆ బ్లాకులో యింకా సర్వేయే కాలేదు. సర్వేఅయిందని report ఇంకా రాలేదు. ఆబ్లాకును మొన్నమొన్ననే ఆరంభిస్తే ఇంత తొందరలో అక్కడి మంచిచెడులు గోపాలకృష్ణయ్యగారికి ఎట్లా బోధపడినవో ఆశ్చర్యముగా ఉన్నది. కాబట్టి వారు ఎవరో చెప్పిన information మీద ఆధారపడి ఆ విధముగ మాట్లాడారనుకుంటాను. స్వయముగ చూడకుండా, ఎవరోచెప్పిన information మీద ఆధారపడి యిక్కడ సభలో మాట్లాడడము మంచిదికాదని మనవిచేస్తున్నాను.

తరువాత ఈ Block Committees లో M. L. A. లకు కూడ ఓటింగు రైటు కావాలని అన్నారు. ఈ విషయమును గురించి ప్రభుత్వము యింకా నిర్ణయము తీసుకోలేదు. M. L. A.s కు కూడా తప్పకుండా voting right ఉండాలనే ప్రభుత్వము యొక్క ఉద్దేశ్యము కూడ. వారికి కూడ voting right ఉండడము మంచిదే. కాని ఒక్కవిషయము మాత్రము గౌరవసభ్యులు గుర్తించాలి. ఇక్కడ M. L. A. గా ఉండి Block Committee President గా నిలబడే పరిస్థితి ఉండకూడదు. Block Committee President గా పంచాయితీబోర్డు ప్రెసిడెంటుగా ఉన్నవారు ఎన్నుకోబడవలసిందే కాని, ఇతరులు ఉండడం పనికిరాదని ప్రభుత్వముయొక్క అభిప్రాయము. ఇక్కడ M. L. A. గా ఉండి అక్కడకుపోయి బ్లాకు ప్రెసిడెంటుగా contest చేయడము ఎంతవరకు సమంజసముగా ఉంటుందో గౌరవసభ్యులే ఆలోచించండి.

జిల్లా సమితులకు non-officials అధ్యక్షులుగా ఉండాలని శ్రీ గోపాలకృష్ణయ్యగారి కుతూహలం కావచ్చు. వారు ఒక సామెతను మరచిపోయారు. "ఎద్దంత కుక్కను పెట్టుకొని, దొర తానే మొరిగినాడు" అని ఒక సామెత ఉన్నది. Administrative machinery పెట్టుకొని, execution కోసం కోట్లకొలది రూపాయలు ఖర్చు చేస్తున్నాము. అటువంటప్పుడు (non-officials) అధికారేతరులు execution చేస్తారా? అసలు non-officials చేత execution చేయించాలనే approach సరైనదికాదు. అది సరిగా జరుగుతుందనే విషయంలో నాకు అనుమానం ఉన్నది. Criticise చేసే అధికారం మనకు ఉంచుకోకుండా,

దాంట్లో ఇరుక్కొని విమర్శలకు గురికావడం, దుష్ప్రచారానికి పాలుకావడం ఎంతవరకు ఉచితమో నాకు తెలియడం లేదు. ఇప్పుడు బ్లాకు సమితులకు అన్ని అధికారాలూ ఇచ్చినాము. Taxation Powers, Rules ను frame చేయు అధికారం మొదలైనవన్నీ వారికే ఇచ్చాము. ఇంక Legislative control ఏది? Legislative Sovereignty తీసేస్తామా? రాష్ట్ర పరిపాలన యొక్క purview నుంచి తీసేస్తామా ? చెరువులు బాగుచేసే విషయంలోగాని, రోడ్లువేసే విషయంలో గాని, లేక health కు సంబంధించి చేసే పనులలోగాని ప్రభుత్వమూ, legislature వెళ్ళి అధికారం లాక్కొని అంతా మేమే చేస్తాం అని వ్యవహరించడం మంచిదికాదు. ఇది state within a state గా పరిణమిస్తుంది. ఈవిషయం నేను యిక్కడే వెనుక ఒకసారి మనవిచేశాను. ప్రత్యేకంగా ఒక క్రొత్త diarchy ని స్థాపించడంకాదు, State within a State కాదు. బ్లాకు సమితులు గాని జిల్లా సమితులుగాని యివి ప్రజాసంస్థలకూ, bureaucracy కి మధ్యన interlocking arrangements వంటివి. పంచాయతీబోర్డులు, Co-operative Societies మొదలైన ప్రజాసంస్థలు ఉన్నాయి. ఇటువైపు Bureaucracy-Governmental apparatus ఉన్నవి. ఈరెండూ parellel lines మీద పోతున్నాయి. వీటివల్ల ప్రజలకు ఇబ్బంది కలుగుతున్నది. కాబట్టి, యీ రెండింటికీ అక్కడక్కడ tiers వేసి కలుపుకుంటూ పోతున్నాము. రెండింటికీ పరస్పర సంబంధం కలుగజేద్దామనే ఉద్దేశ్యంతో interlocking arrangements చేస్తున్నాము. బ్లాకు సమితులకు సంపూర్ణమైన స్వేచ్ఛ ఉన్నది. అసెంబ్లీతోగాని, ప్రభుత్వంతోగాని సంబంధంలేదు అనుకొనే దృక్పథం వాస్తవమైనదికాదని మనవిచేస్తున్నాను. జిల్లా బోర్డులను రద్దుచేయడం అంటే—కొత్తగా యీ బ్లాకు కౌన్సిళ్ళను వాటిస్థానంలో ఉంచడంలేదు. జిల్లాబోర్డులు Diarchy లో ఒక autonomous bodies. Parallel functions ఉండేవి. పనిలో duplication జరుగుతూ ఉండేది. ఈనాడు అదంతా తీసేసి, జిల్లాకౌన్సిళ్ళను పెడుతున్నాము అంటే administrative machinary నీ people's representation నూ కలిపి ఒక వ్యవస్థను నిర్మిస్తున్నాము. ఇప్పుడు స్పీకరుగారు అధికారేతరులుగా, మనకు పెద్దలుగా ఉన్నారు. వారు Legislators' head కాని, executive కి head కాదు. State అంతకూ Head గవర్నరుగారు. ముఖ్యమంత్రిగారు గవర్నమెంటల్ హెడ్. వారివారి functions ప్రత్యేకంగా demarcate అయి ఉన్నాయి. స్పీకరుగారు ఒకవైపు. High Court Chief Justice ఒకదిక్కు. Chief Minister గారు ఒకదిక్కు. గవర్నరుగారు ఒకదిక్కు. నలుగురూ 4 దిక్కులకూ లాగడంలేదు. అందరియొక్క common objective ఏమిటి అంటే State యొక్క stability, State యొక్క existence, State యొక్క progress. ఇంకొక ముఖ్య విషయం ఏమంటే నీతి, అవినీతి అనేవి

మనం నివసించే వాతావరణం యొక్క ప్రభావం మీద ఆధారపడి ఉంటుంది. మన social structure లో ఎటువంటి factions ఉన్నాయో, ఎటువంటి అవినీతి ఉందో అవి అన్నికూడా మనంచేసే ప్రతి పనిమీదా కూడా ప్రభావాన్ని వేస్తాయి. మన environments మారనంతవరకూ యిటువంటి reflections జరుగుతూ ఉంటాయి. ప్రజలలో జాగృతి రానిదే, వారిలో వివేకం రానిదే ఎక్కువ బాధ్యతలు వారిమీద మోపినంత మాత్రాన లాభంలేదు. ఆ విషయం గురించి ఒక గౌ॥ సభ్యులు కూడా చెప్పారు. ఈవేళ మనం non-officials కు executive powers కావాలంటున్నాము. పంచాయితీబోర్డు ప్రెసిడెంటులను బ్లాకు కమిటీల అధ్యక్షులుగా చేయబోతున్నాము వారిక్రింద ఆఫీసరులను పనిచేయమంటున్నాము. ఒక వేళ ఆ ప్రెసిడెంటు యీ occasions కు rise కాకపోతే programme అంతా fail అయిపోతుంది. Programmes fail అయితే Democracy fail అయిపోతుంది. ఇప్పుడు మనం తలపెట్టిన నూతన కార్యక్రమం Democratic elements కు ఒక challenge వంటిది. ఈనాడు చిన్న చిన్న పంచాయితీబోర్డు ఎన్నికలలోనే party influences ఉంటున్నాయి. Library movement లో party influnences ఉంటున్నాయి. దీనినిబట్టి చూస్తే Block Committee లలో కూడా party influences ఉండగలవని నమ్మవలసివస్తోంది. మనం యీనాడు political life లో ఉన్నాము. అధికారేతరుల చేతులో executive power పెడితే political parties తగాదాలు పడి, మా గ్రామంలో ఆ పని జరగాలని ఒకరు, కాదు మా గ్రామంలోనే జరగాలని మరొకరు, గొడవలుపడి, బాధలుపడుతూ, ఒకరు ఇట్లాగ మరొకరు అట్లాగ లాగుతూ ఉంటే, ఇప్పుడు జరుగుతున్న కొంచెం పనికూడా కుంటుపడుతుందేమోననే భయంకూడా ఉన్నది. అయినప్పటికీ తప్పదు. People's association లేనిదే కార్యక్రమాలు జరుగవు. ప్రజల సహకారం, participation లేనిదే కార్యక్రమాలు జరుగవు. అందువల్ల closer association పొందడానికి యింతకంటే మార్గంలేదు. Democratic Decentralisation తీసుకువస్తున్నాము. Experiment చేస్తున్నాము. బ్లాకు సమితులలో మేము చెప్పిన మాటలు వినడంలేదని మీరే అంటున్నారు.

*Mr. Speaker :* At least, the Minister should address the Chair. బయట సోదర, సోదరీమణులారా అన్నట్లుగా అంటే బాగుండదు.

*Sri V. B. Raju* : It is a bad habit, Sir.

శ్రీ ఎన్. సంజీవరెడ్డి : అది అప్పుడప్పుడు స్పీకరుగారికి కూడా వస్తూంటుంది (నవ్వులు)

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు : వారు ఏమిచెప్పినా మిమ్ములను గురించి చెప్పినట్లుగానే అనుకోండి.

శ్రీ వి. బి. రాజు : ఈ విషయంలో ప్రభుత్వానికి ప్రజల సహకారం కావాలి. రాజకీయపార్టీల సహాయం లేనట్లయితే Democracy కి దెబ్బ తగులు తుందని మనవి చేస్తున్నాను. మనలో ఎన్ని భేదా లున్నప్పటికీ—ప్రజాసహకారం కావాలంటే ప్రతిపక్ష సభ్యుల సహకారం కూడా తీసుకోవాలి అని ప్రతిపక్ష సభ్యులు శ్రీ రాజేశ్వరరావుగారు చెప్పారు. కమ్యూనిస్టుపార్టీ సహకారం ఉంటుందని ప్రభుత్వానికి విశ్వాసం ఉన్నట్లయితే తప్పకుండా తీసుకుంటుంది. అట్టి విశ్వాసం ఉన్నది కనుకనే, ఈ మధ్యన Consultative Committee లోనికి State Planning Board లోనికి ప్రతిపక్షాలనుండి సభ్యులను తీసుకుపోవడం జరిగింది. ఈ పద్ధతి ఆరంభం అయినది. ఇదివరకు ఉండే భేదం, తారతమ్యం, gulf తగ్గిపోతున్నది. ఇకముందు Block level లోనికి కూడా తీసుకురావడానికి ప్రయత్నం జరుగుతోంది. బ్లాక్ కమిటీలు ఏర్పడుతున్నప్పటికీ అందులో మమ్ములను వేయలేదు అని కాంగ్రెసు సభ్యులే అంటున్నారు. ఇటువంటి విమర్శలు వస్తూనే వుంటాయి. ఎంత ప్రయత్నించినప్పటికీ వ్యక్తుల నియామకం సందర్భంలో బాధలు వస్తుంటాయి. ప్రభుత్వానికి అట్టిబాధ లేకుండా చేయాలంటే నేను చెప్పిన దొక్కటే కొత్తమార్గం. ప్రజలచే ఎన్నుకోబడిన పంచాయతీ బోర్డు ప్రసిడెంటుల చేతనే, 4, 5 మంది సభ్యులను Co-opt చేయించే విధంగా—ఆ బాధ్యత వారిమీదనే పెట్టినట్లయితే, ప్రభుత్వంమీద యిటువంటి విమర్శలు పోతాయి. బాధ్యత ప్రజలమీదనే ఉంటుందని మనవిచేస్తున్నాను. క్రొత్తగా ఏర్పడుతున్న సమితులలో కమ్యూనిస్టు సభ్యులు తోడ్పడి, వాటిని బాగా నడిపేటట్లయితే, ఆ కార్యక్రమాన్ని విజయవంతం చేసినట్లయితే ప్రజాస్వామ్యం స్థిరంగా ఉంటుంది.

ఇక S. E. O. జీవు అనేది ఒక పెద్ద controversial subject గా గోపాల కృష్ణయ్యగారు తీసుకువచ్చారు.

నేను introductory speech లో చెప్పినట్లుగా ఎక్కువమంది స్త్రీలు అభివృద్ధి కార్యక్రమాలలో ప్రజాసేవలో పాల్గొనడానికి అవకాశం యిస్తున్న కార్యక్రమం యిది ఒక్కటే. సుమారు 500 మంది స్త్రీలకుపైగా యిందులో పాల్గొనటానికి అవకాశం ఉంటుందని నేను యిదివరకే చెప్పినాను. ఇంతపెద్ద కార్యక్రమం జరుగుతున్న సమయంలో యిది గిట్టనివారు, చెల్లనివారు వ్యతిరేక ప్రచారం చేస్తుంటే ఆ ప్రచారానికి శాసనసభ్యులుకూడా గురికావలసినదేనా ? ఎవరో బయట అంటున్నారని మనం యిక్కడ అనడమేనా ? మనం చేసే ప్రతి పనియొక్క ప్రభావమూ ముందు ముందు కనబడుతుంది. మన environment

social outlook యివి మన ఉద్యోగస్తులమీద గూడ ప్రభావం వేస్తాయి. S. E. O. లు కూడా మనవలె మానవమాత్రులే, మనం శాసనసభ్యులం. We cannot arrogate to ourselves, or claim to ourselves all honesty and we deprive others of the right to claim honesty.

S. E. O. స్త్రీ ఐనది కనుక ఇటువంటి విమర్శకు గురికావలసి వచ్చినది. అప్పుడు the responsibility is on the men. ఇలాంటి విమర్శ వచ్చినప్పుడు ఏ శాసనసభ్యుడైనా పురుషులను ఖండించి మంచి వాతావరణమును సృష్టించుటకు ప్రయత్నం చేసినారా? ఈ వేళ స్త్రీలు ధైర్యంగా గ్రామాలలోకి వెళ్ళి పనిచేయుటకు తయారౌతున్నారు అంటే మనం గొప్పగా శ్లాఘించవలసి ఉన్నది. ఏ దేశంలో కూడా ఈ విమర్శలు ఉండవు. మన దేశంలోనే ఇలాంటి విమర్శలు జరగడం మన దుర్గతి అనుకోవాలి. వేదికపై నిలబడి "స్త్రీలు చాలా వెనుకబడి ఉన్నారు; వారు ముందుకు రానిదే దేశం అభివృద్ధి గాంచనేరదు" అని శ్రీరంగనీతులను మనమే చెప్పుతాము. ఇంత బాధ్యత కలిగి ఉన్న మనం స్త్రీలు పనిచేస్తున్నప్పుడు సినిమాకు పోయారనో లేక జీపు మీద ఒంటరిగా పోయారనో విమర్శ చేయడం జరుగుతున్నది. మరి దీనిని ఎలా సమన్వయం చేయాలో ప్రభుత్వానికి తెలియదు. ప్రభుత్వానికే కాదుగదా దానిని సృష్టించిన వాడికి కూడా తెలియదు. గోపాలకృష్ణయ్యగారు దానికేమైనా మార్గమును కనిపెట్టారేమో వారికే తెలియాలి. కనుక సెక్సు విషయం, individuals విషయం మాట్లాడునప్పుడు మనం దీర్ఘంగా ఆలోచించి మాట్లాడాలని మనవి చేయుచున్నాను......

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య : అధ్యక్షా, నేను ఆ impression లో లేనండి......

మిస్టర్ స్పీకర్ : మీరు కూర్చోండి. నేను పర్మిషన్ ఇవ్వను.

శ్రీ వి. బి. రాజు : వారి విషయంలో ఎవరు మాట్లాడదలచుకొన్నా ఉత్సాహకరంగా మాట్లాడాలని మనవి చేయుచున్నాను. ప్రభుత్వ పాలసీని ఖండించండి. ప్రభుత్వాన్ని, కాంగ్రెసుపార్టీని దూషించండి. అంతేకాని ఎన్నో కష్టాలను అనుభవించుతూ పనిచేస్తున్న ఉద్యోగస్తులను వారు ఆడవారైనా మగవారైనా విమర్శించునప్పుడు చాలా జాగ్రత్తగా ఉండాలి. వెనుకటి రోజులుకావు ఇవి. అవి గతించినవి. బ్రిటిష్ ప్రభుత్వం, నిజాం ప్రభుత్వం ఉన్నప్పుడు చేసే విమర్శలు ఇప్పుడు పనికిరావు అని మనవి చేస్తున్నాను.

కమ్యూనిటీ లెట్రిన్సు విషయంలో అక్కడ సరైన water supply లేనందున septic system arrangements బాగాలేవు. అందువల్ల ప్రభుత్వం encourage చేయదలచుకోలేదు.

శాంక్షన్సు చాలా delay ఐనవి అన్నారు అసలు ఈ సంవత్సరం గట్టి ప్రయత్నంచేసి శాంక్షన్సు చాలా త్వరగా పంపించాము. Local developments విషయంలో మాత్రం భారత ప్రభుత్వం మొట్టమొదట 34 లక్షల రూపాయలు ఇచ్చినది. తరువాత 7 లక్షలు, ఇంకొక పర్యాయం మరొక 7 లక్షలు, మొత్తం దాదాపు 50 లక్షలు ఇచ్చినది. తరువాత వచ్చిన రెండు కిస్తీల విషయంలో కేంద్ర ప్రభుత్వం కొంత ఆలస్యం చేసింది. ఐనప్పటికి శాంక్షన్సు రాకపోవడం వల్ల పనులు ఆగిపోయాయనే విమర్శకు అవకాశం లేదని చెప్పుతున్నాను. ఇప్పుడు వచ్చిన 50 లక్షలలో 34 లక్షలు ఆంధ్ర జిల్లాలకు కేటాయించినాము. ప్రోగ్రెస్ రిపోర్టు ప్రకారం 20 లక్షల రూపాయలు అప్పుడే ఖర్చు అయి పోయింది. ఎక్కువ భాగం ఫిబ్రవరి, మార్చి నెలలలోనే ఖర్చు అవుతుంది. వారు సంపూర్ణంగా ఆ డబ్బునంతా ఖర్చు చేయగలరని నాకు విశ్వాసమున్నది. అందుకు అనుమానము ఏమీలేదు. తెలంగాణాలో గత మూడు మాసాలనుండి పనులు చాలా త్వరితంగా జరగాలని నేను జిల్లా అధికారుల వెంటబడుటే కాక వ్యక్తి గతంగా వారికి ఉత్తరములుకూడా వ్రాశాను. చిన్న చిన్న local development works ప్రజలను ఆకర్షించుతవి. గాన వారిమీద వొత్తిడి తీసుకువచ్చినాను. తెలంగాణాలో కొన్ని ఇబ్బందులున్నవి. అదీగాక ఈ తెలంగాణ, ఆంధ్ర చర్చలలో నేను పాల్గొనదలచుకోలేదు. ఎందువల్లననగా ఆ సమస్యను ఎంత ఎక్కువ చర్చిస్తే అంత చెడిపోతుంది. దానికి సొల్యూషన్ దొరకదు. కాబట్టి చర్చించేబదులు సరి చేసుకొంటూపోయిన ప్రజలు ఆ భేదాలను మరచిపోతారనే ఉద్దేశం కలవాడిని నేను. ఈ పనులకు ఇక్కడఉన్న పద్ధతులు, రూల్సు కొంత ఆటంకం కలిగిస్తూ వచ్చి నవి. ఒకచిన్న ఉదాహరణ మనవిచేస్తాను. ఇప్పుడు గ్రామాలలో ఎవరైనాsponsors వచ్చి పనిచేసినవారికి డబ్బు ఇచ్చుటకు డిస్ట్రిక్టు ట్రెజరీ ఆఫీసర్ సర్టిఫికెట్ కావాలి. అందువల్ల రెండు మాసాల క్రిందట ఫైనాన్సు డిపార్టుమెంటువారిని ఒప్పించి తాసిల్‌దారుకు ఆ పవర్సును ఇప్పించినాము. అందువల్ల ఆ బిల్స్ త్వరగా వచ్చుటకు అవకాశమున్నది. బిల్సు త్వరగా రాకపోవుటవల్ల ఎంతోమంది స్పాన్సరర్సు ఎందుకు పని నెత్తిమీద వేసుకోవాలి? ఎందుకు నష్టపడాలి? అని ముందుకు రావడంలేదు. పనులను సగములో వదలివేసి వెళ్ళిన సందర్భాలు కూడా ఉన్నవి. అంతేగాక తెలంగాణజిల్లాలలో లోకల్ ఇంజనీర్సు ఉండేవారు. ఒక్క లోకల్ ఇంజనీయర్ మున్సిపల్ వర్క్సును, డిస్ట్రిక్టు బోర్డు వర్క్సును, లోకల్ డెవలప్‌మెంటు వర్క్సును చూడాలి. ఆంధ్రలో ఒక అసిస్టెంటు ఇంజనీ యర్‌ను ప్రతి జిల్లాకు ఇచ్చారు. అందువల్ల ఇక్కడ కూడా ప్రతి జిల్లాకు ఒక అసిస్టెంటు ఇంజనీయర్‌ను నెలక్రిందట ఏర్పాటుచేసినాము. వారు వచ్చిన తరు వాత పనులు చురుకుగా జరుగుతున్నవి. ఇంజనీరింగు పర్సనెల్ స్టాఫును ఎక్కువ చేయవలసిన అవసరమున్నది. ఇక్కడ కాంట్రిబ్యూషన్ శక్తి ప్రజల

దగ్గర తక్కువగా ఉన్నది. కోస్తా జిల్లాలలో ఎక్కువగా ఉన్నది. అసలు అక్కడ అవసరంకంటె ఎక్కువ ప్రపోజల్సు వచ్చి పడిఉన్నాయి. ఒక్క తెనాలి తాలూకాలో గాని, తూర్పు గోదావరి జిల్లాలోని రామచంద్రపురంలో గాని మనం ఈ రాష్ట్రం మొత్తమునకు ఇచ్చే డబ్బును వారు తమ ఒక్క తాలూకాలోనే ఖర్చు చేయగలరు. అందుకు తగ్గ కాంట్రిబ్యూషన్ వారు ఇవ్వగలరు. తెలంగాణాలో ముఖ్యంగా upland తాలూకాలలో ఈ కాంట్రిబ్యూషన్ శక్తి చాలా తక్కువైపోయింది. అందువల్ల జిల్లాబోర్డులలో డబ్బు ఉన్నవారు కంపల్సరీగా ఇవ్వవలసిన $12\frac{1}{2}\%$ కాక $25\%$ వరకు కాంట్రిబ్యూట్ చేయ వచ్చునని చెప్పినాము. పంచాయితీబోర్డు వర్క్సును స్పాన్సర్ చేయునప్పుడు వారు కూడా 10% వరకు ఇవ్వవచ్చును. ఇక ప్రజలు కాంట్రిబ్యూట్ చేయ వలసింది $16\frac{2}{3}\%$ మాత్రమే. అందులోనూ ఒక పనిని ఆ వూరిలోనే ఇచ్చిన కంట్రాక్టరుకు వచ్చు లాభం వారికే దొరుకుతుందికదా! అందువల్ల చివరకు ప్రజలమీద పడు భారం 5% నుండి 10% మాత్రమే ఉంటుంది. శాసనసభ్యు లంతా ఈ పనులయందు శ్రద్ధ తీసుకొని వారి వారి నియోజకవర్గాలలో సరిగా పనులు జరుగకపోతున్నయెడల ప్రభుత్వానికి తెలియపరచుచుండాలని కోరుతు న్నాను. నేను స్వయంగా జిల్లాలలో తిరిగి ఈ పనులను చురుకుగా సాగించ వలెనని, ఒక్క దమ్మిడీ కూడా lapse చేయవద్దని జిల్లా కలెక్టర్లతో చెప్పుతు న్నాను. అప్పటికీ ఇచ్చిన డబ్బును ఖర్చుచేయగలరనే నమ్మకం నాకులేదు. 15 లక్షల 56 వేలు తెలంగాణ జిల్లాలకు ఇవ్వగా ఫిబ్రవరి ఆఖరివరకు 4 లక్షల 30 వేలు మాత్రమే ఖర్చు అయినది. నల్లగొండ జిల్లాలో 3% మాత్రమే ఖర్చు అయినది. 143675 రూపాయలు కేటాయిస్తే ఇంతవరకు రూ. 5258 లు మాత్రమే ఖర్చుఐనది. దీనికి లోపమెక్కడ ఉన్నదో మన మంతా తెలుసుకొనుటకు ప్రయత్నించాలి. మేము ఈవేళ కళ్ళుమూసుకొని కూర్చోదలచుకోలేదు. ప్రతిపక్షాలవారు విమర్శిస్తారని భయపడదలచుకోలేదు. జిల్లా అధికారులకు వ్రాస్తే వారు, ప్రజానాయకులు సహకరించకపోవుటవల్ల కాంట్రిబ్యూషన్సు రాకపోవుటవల్ల, స్పాన్సర్సు ముందుకు రానందువల్ల పనులు జరుగుటలేదని చెప్పుచున్నారు. అధికారులు సరిగా పనిచేయుటలేదని, వారు శ్రద్ధచూపుటలేదని estimates త్వరగా తయారుచేయుటలేదని ఇక్కడ సభ్యులు విమర్శిస్తున్నారు. ఈ చిదంబర రహస్యం ఎట్లా తెలియాలి? ఈ పనులు జరుగుట చాలాముఖ్యం. ఒకవేళ కేంద్రప్రభుత్వం సహాయం చేయకపోయినా రాష్ట్ర ప్రభుత్వాలు ఈ local development works ను సాగించవలసిందే. ఆంధ్రలో ఇంత విజయవంతమైన కార్యక్రమము మరొకటిలేదు. భారతదేశం మొత్తం లోనూ ఆంధ్రలో ఈ కార్యక్రమము విజయవంతంగా సాగిందని అందరికి తెలుసు. అందువల్ల ఈలోకల్ డెవలప్‌మెంటు వర్క్సు విషయంలో ప్రతి

జిల్లానుండి వచ్చిన శాసనసభ్యులు ముఖ్యంగా తెలంగాణా శాసనసభ్యులు శ్రద్ధ తీసుకోవాలని నేను మరల చెప్పుతున్నాను. ఇది కేవలం విమర్శతో పోయేది కాదు ఇది ఒక్క రోజుతోపోయే కార్యక్రమంకాదు. క్రొత్తపనులు ప్రారంభించకముందు పాతవి అసంపూర్ణంగా ఉండకూడదు. ఈ కార్యక్రమానికి అయ్యేఖర్చులో సగభాగం కేంద్రంభరిస్తుంది. రాష్ట్రప్రభుత్వం ఇచ్చేది ఏమీలేదు. అందువల్ల అది సరిగా ఖర్చుచేయనిచో దానిని కేంద్రం withdraw చేసుకుంటుంది. తిరిగి ఆడబ్బు మనకురాదు. మన రాష్ట్రప్రభుత్వం ఇచ్చునది ఐనచో lapse ఐనా ఫరవాలేదు. ఇది భారతప్రభుత్వం డబ్బు కనుక next year దానిని repeat చేయరు. అందువల్ల త్వరగా పనులుచేసుకొని ఆ డబ్బును సద్వినియోగం చేసుకోవాలని కోరుతున్నాను.

కొందరు సభ్యులు వేస్టేజ్ వుందని చెప్పారు. మినిమమ్ కరప్షన్ ఉందని చెప్పారు. అక్కడ అవకాశం లేదుకాబట్టి కరప్షన్ లేదని కొందరు చెప్పారు. వేస్టేజ్ వుందని మేము ఒప్పుకొన్నాము. దూరంవెళ్ళాలంటే జీప్స్ అవసరము. పాదయాత్రగానూ, ఎడ్లబండిలోను వెళ్ళటం కష్టము. గ్రామములను visit చేయటంలేదు. B. D. O. లు వెళ్ళని గ్రామాలు ఉన్నాయి అని చెప్పారు. అటువంటివి ప్రభుత్వ దృష్టికి గౌరవ సభ్యులు తీసుకువస్తే విచారిస్తాము. ఈ ప్లానింగ్ కమిటీ మీటింగులకు రాకపోకల T. A. లకే డబ్బు ఖర్చుఅవుతోందని చెప్పారు. ప్లానింగ్ కమిటీలు లేకపోతే ప్రజల అభిప్రాయం ఎలా తెలుస్తుందో నాకు తోచటంలేదు. పెట్రోలుకు ఖర్చు అవుతోందని చెప్పారు. జీప్స్ కలెక్టరు అనుమతిలేనిదే బైటకు పోకూడదు. జీప్స్‌పై ఒక బోర్డు ఉంచాలి. ఇవ్వన్నీ కట్టుబాటు చేసి ఎడ్మినిస్ట్రేషన్‌ను నడిపిస్తున్నాము. ఉద్యోగులు ఎక్కువ వున్నారని ఎవ్వరూ చెప్పలేదు వారు పనిచేయటంలేదనే చెప్పారు. వారిచేత పనిచేయించవలసిన బాధ్యత మనది. వారు పనిచేయటానికే వచ్చారు. అందుకు అనేక టార్గెట్స్ పెట్టాము. "డబ్బుఖర్చు పెట్టామని చెబుతున్నారు కాని మీరేమి సాధించారు?" అని కమాలాదేవిగారు చక్కని ప్రశ్న వేశారు. చెప్పటానికి 29 items వున్నాయి కాని time లేక అన్నీ చదవటంలేదు. 1952 నుండి 1957 డిసెంబరు వరకు ఇర్రిగేషన్ క్రింద 6,60,167 ఎకరాలు బ్లాక్ డెవలప్‌మెంట్ ఏరియా ఎక్కువ అయినది.

శ్రీ కె. ఎల్. నరసింహారావు (ఎల్లందు - జనరల్): బ్లాక్ ఏరియాలో మరమ్మత్తు అయిన చెఱువులుకూడా దీనిక్రిందకే వస్తాయా?

శ్రీ వి. బి. రాజు: మరమ్మత్తుచేసిన దానినిబట్టి చెబుతాము. కొత్తగా 6,208 మంచినీటి బావులు త్రవ్వబడ్డాయి. drinking water wells renovated 33,998. కొత్తగా 4656 మైళ్ళ రోడ్లు construct చేయబడినవి. అంతా

metal కాలేదు. కొంత కచ్చా రోడ్డు వుంది. Existing Roads improved 3912 మైళ్లు. Number of culverts constructed 2243.

ఈవిధంగా వున్నాయి. అధ్యక్షా, మీరిచ్చిన కాలవ్యవధి అయిపోయింది కనుక మీ ద్వారా గౌరవ సభ్యుల నందరిని ఈ డిమాండులు ఆమోదించ వలసిందిగా కోరుతున్నాను.

*DEMAND No. XXXVII—Community Development Projects National Extension Service and Local Development Works: Rs.* 3,27,11,000

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 3,27,11,000 for Community Development Projects, N. E. S. and Local Development works by Rs. 100

To discuss the policy.

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 3,27,11,000 for Community Development Projects, N. E. S. and Local Development works by Rs. 100

(గజపతి నగరంలో యింతవరకు కమ్యూనిటీ బ్లాకులుగాని యితర బ్లాకులుగాని లేనందుకు, యీవిషయము ప్రభుత్వ దృష్టికి తీసుకురాగలందులకు)

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 3,27,11,000 for Community Development Projects, National Extension Service and Local Deve-opment works by Rs. 100

To Criticise the Government's policy for not establishing N. E. S. Blocks in many taluks especially Agency areas and backward areas so far.

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 3,27,11,000 for Community Development Projects, National Extension service and Local Development works by Rs. 100

For the failure of Government to get Co-operative Societies functioned in Shermahammadpuram Block area.

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 3,27,11,000 for Community Development Projects, National Extension Service and Local Development works by Rs. 100

For the failure of the Government to fix the Block Head Quarters helpful to the people of Block area.

The motion was negatived.

*Sri M. Satyanarayana Raju*: I demand a division Sir.

The House then divided.

Ayes : 37 ; Noes : 84.

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 3,27,11,000 for Community Development Projects, National Extension Service and Local Development works by Rs. 100

For the failure of the Government to reduce the contribution to be made by the villagers in L. D. with N. E. S. and C. D. Projects and to fix at not more than 1/4 in cases of backward and dry areas.

The motion was negatived.

*Sri Pillalamarri Venkateswarlu:* I demand a division Sir.

The House then divided

Ayes : 37 ; Noes : 86.

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 3,27,11,000 for Community Development, National Extension Service, Local Development works by Rs. 100

(ప్రభుత్వం విధానం విమర్శించుటకు)

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 3,27,11,000 for Community Development Projects, National Extension Service and Local Development works by Rs. 100

(యన్. ఇ. యస్. బ్లాకులు నిర్మల్, ముధోల్ తాలూకాలలో యివ్వలేనందులకు)

The motion was negatived.

*Sri G. Ganga Reddy*: I demand a division Sir.

The House then divided.

Ayes: 37; Noes: 87

The motion was negatived.

*Mr. Speaker:* Order, Order - It being 1-30 P. M. now, in pursuance of the decision of the Assembly today. I proceed successively to put forthwith the question on the demand under discussion and also the questions on other Demands, notice of which had been given by government:

*DEMAND No. XXXVII—Community Development Projects National Extension Service & Local Development Works Rs.* 3,27,11,000

The question is:

"That the Government be granted a sum not exceeding Rs. 3,27,11,000 under Demand No. XXXVII Community Development Projects, National Extension Service and Local Development Works."

The motion was adopted.

*DEMAND No. II—Excise Department - Rs.* 62,04,700

*Mr. Speaker*: The question is:

'That the Government be granted a sum not exceeding Rs. 62,04,700 under Demand No. II - Excise Department.,

The motion was adopted.

*DEMAND No. III—Stamps Administration - Rs.* 14,51,600

*Mr. Speaker*: The question is:

'That the Government be granted a sum not exceeding Rs. 14,51,600 under Demand No. III - Stamps Administration.'

The motion was adopted.

*DEMAND No. V Registration Department - Rs.* 19,83,600

*Mr. Speaker:* The question is:

'That the Government be granted a sum not exceeding Rs. 19,83.600 under Demand No. V - Registration Department.'

The motion was adopted.

*DEMAND No. VI—Taxes on Motor Vehicles - Rs.* 8,19,400

*Mr. Speaker:* The question is:

'That the Government be granted a sum not exceeding Rs. 8,19,400 under Demand No. VI - Taxes on Motor Vehicles.'

The motion was adopted.

*DEMAND No. VII—Sales Tax Administration - Rs.* 39,35,000

*Mr. Speaker*: The question is:

'That the Government be granted a sum not exceeding Ks. 39,35,000 under Demand No. VII - Sales Tax Administration.'

The motion was adopted.

*DEMAND No. VIII—Other Taxes and Duties Administra:ion - Rs.* 42,71,000

*Mr. Speaker*: The question is:

'That the Government be granted a sum not exceeding Rs. 42,71,000 under Demand No. VIII - Other Taxes and Duties Administration.'

The motion was adopted.

*DFMAND No. XIII—Administration of Justice - Rs.* 91,73,400

*Mr. Speaker*: The question is:

"That the Government be granted a sum not exceeding Rs. 91,73,400 under Demand No. XIII - Administration of Justice."

The motion was adopted.

*DEMAND No. XIV—Jails - Rs.* 37,50,500

*Mr. Speaker*: The question is:

"That the Government be granted a sum not exceeding Rs. 37,50,500 under Demand No. XIV - Jails."

The motion was adopted.

*DEMAND No. XV—Police - Rs.* 5,32,45,600

*Mr. Speaker*: The question is:

"That the Government be granted a sum not exceeding Rs. 5,32,45,600 under Demand No. XV - Police."

The motion was adopted.

*DEMAND No. XXV—Aviation - Rs.* 40,000

*Mr. Speaker*: The question is:

"That the Government be granted a sum not exceeding Rs. 40,000 under Demand No. XXV - Aviation."

The motion was adopted.

*DEMAND NO. XXXI — Territorial and Political Pensions - Rs.* 13,12,000

*Mr. Speaker*: The question is:

"That the Government be granted a sum not exceeding Rs. 13,12,000 under Demand No. XXXI - Territorial and Political Pensions."

The motion was adopted.

*DEMAND No. XXXII — Privy Purses and Allowances of Indian Rulers - Rs.* 33,000

*Mr. Speaker*: The question is:

"That the Government be granted a sum not exceeding Rs. 33,000 under Demand No. XXXII - Privy Purses and Allowances of Indian Rulers."

The motion was adopted.

*DEMAND No. XXXIII — Pensions - Rs.* 2,38,75,700

*Mr. Speaker*: The question is:

"That the Government be granted a sum not exceeding Rs. 2,38,75,700 under Demand No. XXXIII - Pensions."

The motion was adopted.

*DEMAND No. XXXIV — Stationery and Printing - Rs.* 86,03,000

*Ms. Speaker*: The question is:

"That the Government be granted a sum not exceeding Rs. 86,03,000 under Demand No. XXXIV - Stationery and Printing."

The motion was adopted.

*DEMAND No.XXXV—Miscellaneous* - 1,94,12,300

*Mr. Speaker*: The question is:

"That the Government be granted a sum not exceeding Rs. 1,94,12,300 under Demand No. XXXV - Miscellaneous."

The motion was adopted.

*DEMAND No. XXXIX—Capital Outlay on Forests - Rs.* 6,19,000

*Mr. Speaker*: The question is:

"That the Government be granted a sum not exceeding Rs. 6,19,000 under Demand No. XXXIX - Capital Outlay on Forests."

The motion was adopted.

*DEMAND No. XLVIII—Commuted Value of Pensions-Rs.* 19,75,600

*Mr. Speaker*: The question is:

"That the Government be granted a sum not exceeding Rs. 19,75,600 under Demand No. XLVIII - Commuted Value of Pensions."

The motion was adopted.

*DEMAND No. L — Loans and Advances by the State Government - Rs.* 6,91,64,800

*Mr. Speaker*: The question is:

"That the Government be granted a sum not exceeding Rs. 6,91,64,800 under Demand No. L - Loans and Advances by the State Government."

The motion was adopted.

*The House then adjourned till Half Past Eight of the Clock on Friday, the 28th March 1958.*